# నాగమ నాయకుడు

( చారిత్రాత్మక నాటకము )

రచన :

శ్రీ పెన్మరాజు వేణుగోపాలకృష్ణమూర్తి

జయంతి పబ్లికేషన్సు,

బిసెంటురోడ్డు.... విజయవాడ - 2.

జయంతి ప్రచురణలు,
ముద్రణ : ఫిబ్రవరి 1980

సోమేశ్వర ప్రింటింగ్ ప్రెస్,
విజయవాడ-2.

వెల : రు 1-50



సంపాదకుడు:
యం. పెరుమాళ్లు.

# కృతి

## కీ. శే. శ్రీమతి కోపూరు నాగరత్నమ్మగారికి

శ్రీమన్మంగళమూర్తి, భక్తనిచయార్తిత్రాత సంత్రాణ దీ
క్షామాధుర్య మయాంతరంగ, తుహినజ్యోత్స్నానాథ వంశోజ్జ్వలో
ద్దామ ప్రాభవ కీర్తికేతనము, ద్వంద్వాదీత, చిచ్ఛక్తి, శ్రీ
సామీప్యస్థితి నీ కొసంగుతను, స్వేచ్ఛన్ నాగరత్నాంబికా!

బ్రతికిన యన్నినాళ్ళు లోక వంకయు లేక, పవిత్రవర్తన
స్థితి, సదయాంతరంగమునఁ దీనులఁ జూచి, సతీమతల్లివై
పతి నెదఁ గొల్చి, భక్తి భగవంతుని నిత్యము గొల్చు
కొంచు; సం
తతికి సుఖంబుఁ గూర్చితివి ధన్యవు నీకిక లోపమున్నదే?

ఏబదియేండ్లె యాయువు లిఖించె విధాత, శతాయు వంతగా
పైబడి వచ్చె పుణ్యపరిపాకము లోకము మెచ్చునట్టి నీ
యీ బలగంబు దానికి మరింతటి వన్నెనుఁ గూర్చువారు; గా
థాబుల బిడ్డవై సుఖ పరంపర దేలుము స్వర్గవాటిలో.

చదివినవారు పుత్రకులు, సత్యమెఱింగినవాడు భర్త; ఇం
పొదవెడి కూర్మితోఁ. యెదనుఁ గౌఁగిలము పంచెడువాడు
భ్రాత, సం
పదలు తరంగలించెడి రసవారిధి జీవనయాత్ర, నీ
మృదు కథనమ్ము ధన్యము, సుఖంపుము సేవల ముక్తజీవవై.

తెలుగుల శౌర్యవాహినులు దిక్తటముల్ ప్రవహింపఁ జేసి, ని
స్తుల జయశ్రీభిశోభిత యశోవిభవ ప్రభవామరేంద్రులై
వెలిగిన తెల్గుజోదుల పవిత్రకథా మధువిద్ది; దీని నీ
కొలఁపు నిసుంగులాంధ్రభువి కూర్మిఁ జనాళికిఁ బంచుతు
గావుతన్.

ది 21-2-1960 వ తేదీ ఆదివారం మొదటిసారి
ది [illegible] కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు
ఎంప్లాయీస్ డ్రమెటిక్ అసోసియేషన్,
విజయవాడ వారిచే ప్రదర్శింపబడిన నప్పటి ...

## నటవర్గం.

| | | |
|---|---|---|
| నాగమ నాయకుడు | : | శ్రీ జె. ఎ. సుబ్బారావు |
| విశ్వనాథ నాయకుడు | : | ,, బి. రాధాకృష్ణమూర్తి |
| కృష్ణదేవరాయలు | : | ,, యం. నారాయణరావు |
| తిమ్మరుసు | : | ,, సి. సుబ్బారావు |
| పరసాం నా[illegible] | : | ,, పి. రామారావు |
| అంబయ శర్మ | : | ,, ఎ. రామచంద్రరావు |
| సుంకరేశ్వరుడు | : | ,, వి. వి. సుబ్బారావు |
| 1 వ గూఢచారి | : | ,, జి. కృష్ణమోహనరావు |
| శెట్టి / 2 వ గూఢచారి | : | ,, యం. వెంకట్రావు |
| సామంతులు | : | ,, డి. హరినారాయణ |
| | | ,, సి. హెచ్. సుబ్బారావు |
| | | ,, సి. హెచ్. ఆర్. కె. వి. ప్రసాద్ |
| | | ,, డి. వెంకట్రామయ్య |
| | | ,, కె. కుచేలరావు |
| సేవకులు | : | చలపతి, గంగరాజు, సుబ్బారావు |

| | |
|---|---|
| శ్రీ టి. వి. రంగారావు | శ్రీ ఎ. రామచంద్రరావు |
| నేపథ్యగానం : | ఆహార్యము : |
| శ్రీ జె. వి. సుబ్బారావు | శ్రీ వి. రాజగోపాలరావు |
| దర్శకత్వము : | పర్యవేక్షణ : |

# పాత్రలు

1. శ్రీకృష్ణదేవరాయలు
2. తిమ్మరుసు
3. నాగమ నాయకుడు
4. విశ్వనాథ నాయకుడు
5. నరసా నాయకుడు
6. అంబయ శర్మ
7. సుందరేశ్వరుడు
8. భట్టు
9. గూఢచారులు
10. సామంతరాజులు
11. సేవకులు

---



శ్రీ పెమ్మరాజు వేణుగోపాలకృష్ణమూర్తి,
తిరువూరు (P. O.)
కృష్ణా జిల్లా.

# మొదటి రంగం

ప్రదేశము : విజయనగర రాజ సభాంగణము

(తెర యెత్తగా మహామంత్రి తిమ్మరుసు, సామంతరాజు, విశ్వనాథనాయకుడు ఉచితాసనాసీనులై ఉంటారు. వందిమాగధ స్తోత్రాలతో శ్రీ కృష్ణదేవరాయలు ప్రవేశిస్తారు. రాయలు రాగానే అందరు తలలువంచి ఆహ్వానిస్తారు.)

నంది : మహిత రాజాధి రాజరాజ పరమేశ్వరా! పరాకు!

మూరు రాయరగండా! బహుపరాకు!

యవనక్షోణీ ఘనస్థాపనా! పరాకు!

కర్ణాట కాంధ్ర సామ్రాజ్యాధీశ్వరా! బహుపరాకు!

కృష్ణ : సామంత ప్రభువులకు కుశలమా?

సామం : సామ్రాజ్య రక్షణభారమును స్వయముగ చక్రవర్తులే వహించుచుండ కుశలమున కేమి లోపము మహారాజా?

విశ్వ : ఒక్క సామంత మండలేశ్వరుల కేకాదు, సామాన్య ప్రజానీకమునకు కూడా కుశలమునకు లోపము లేదు.

తిమ్మ: ప్రేమాభిమాన నిధులగు నింత మంది మండలేశ్వరులు, సేవాధర్మ బద్ధులైన సైన్యాధీశ్వరులు ఉండగా మా కేమి కొదువ?

సామం : ఘటనా ఘటన ఘనులైన మహామంత్రుల సాంనిధ్యమున సామ్రాజ్యమునకు కొరతలుండునా?

కృష్ణ : అప్పాజీ! ఇంతమంది విశ్వసనీయులగు ఆత్మీయు లుండగా మాకిది యొక్క భారమనిపించుటయే లేదు.

తిమ్మ : మతధర్మోద్ధరణము, తన్మూలమున రాజభక్తి, మాతృసేవ యివి విధ్యుక్తములు.

విశ్వ : స్వామిభక్తి, దేశభక్తి, తెలుగువారికి మఱియొకరు నేర్పనవసరము లేదు మహామంత్రీ!

తిమ్మ : వాస్తవము విశ్వనాథనాయకా! మీ తండ్రిగారి మధురయుద్ధ వార్తావిశేషములు తెలియలేదు.

విశ్వ : ఆ విషయమై ఆత్రమెందుకు మహామంత్రీ! నాయన గారంతటివారు వెళ్ళుటయు, మఱియొక విధముగ జరుగుటయు కూడనా?

సామం : అవునవును. ఆయన నిరుపమాన రాజభక్తుడు, సామ్రాజ్య మకుటస్థ రత్నములలో నాయకరత్నము.

తిమ్మ : అనేక యుద్ధములలో విజయలక్ష్మిని చూరగొని ప్రభు గౌరవమునకు వన్నె తెచ్చిన మహావీరుడు.

కృష్ణ : ఆయన యుద్ధకౌశలమును మేము స్వయముగ చూచి నాము అప్పాజీ! అమోఘముగ నున్నది. ప్రత్యర్థులను ఢీకొనుటలో, సరిక్రొత్త వ్యూహములను నిర్మించుటలో ఆయన కాయనయే సాటి.

విశ్వ : ఇంతమంది మహనీయులచే గౌరవింపబడుచున్న యంతటి వాని కడుపున బుట్టినందుకు నేను గర్వపడు చున్నాను.

( ప్రవేశం సేవకుడు )

సేవ : జయము జయము మహారాజా ! మధురనుండి గూఢ చారి వచ్చి దర్శనమునకై వేచియున్నాడు.

తిమ్మ : అనుకొనుచుండగనే వచ్చినాడు. రమ్మను.

సేవ : చిత్తము. (వెళ్తాడు)

సామం : విజయవార్తకై మనసు వేగిరించుచున్నది.

( ప్రవేశం గూఢచారి )

గూఢ : జయము జయము మహాప్రభూ !

తిమ్మ : యుద్ధవార్తలేమి ?

గూఢ : ప్రభువులయాజ్ఞ తలదాల్చి సైన్యసమేతులై నాగమ నాయకులవారు మధురకోట ముందు విడిసి రాజుగారికి కబురంపించినారు.

తిమ్మ : ఏమని ?

గూఢ : "మీరు దురాశకు వశులై, మా సామంత మండ లేశ్వరు లయిన మధుర ప్రభువులను అక్రమముగ యుద్ధ మున నోడించినారు. ఈ చర్య ప్రత్యక్షముగ గాకపోయి నను మా సామ్రాజ్యముపై జరిపినట్లే యైనది. ఉపేక్షింప

రాని నేర మిది. అయినను ఉదారులగు మా ప్రభువులు తమకిట్లు తెలియ జేయుమనినారు. "ప్రజామారణ కారణ మైన రణమొనర్చిన పిదప శత్రుడవై లొంగుదువా? లేక ముందుగనే మిత్రుడవై లొంగుదువా?" అని.

కృష్ణ : ఉదాత్తముగ నున్నది సందేశము.

ఘూర్ణ : ఆ వార్తను విని వీరశేఖరుడు మండిపడి "ఇట్టి అసమర్థ ప్రతాపములు కట్టిపెట్టి మర్యాదగ వచ్చినత్రోవను మరలిపోకున్నచో గెంటించవలసి వచ్చును" అని.

విశ్వ : ఓహో! ఆరిపోవనున్న దీపముకదా! కానిమ్ము.

సామం : ఆ వీరశేఖర చోళుడంతటి మదోన్మత్తుడా?

తిమ్మ : మధురాపుర విజయగర్వాంధుడు కదా?

విశ్వ : వాపును జూచుకొని బలుపని భ్రమించినాడు పాపము.

ఘూర్ణ : చిత్తగింపుడు. ఆ ప్రత్యుత్తరమును విని మూర్ఖులకు సామబోధ వ్యర్థమని మన దళవాయి యుద్ధభేరీ ప్రమోగించినారు.

కృష్ణ : జరుగదగినట్లే జరిగినది తరువాత...

ఘూర్ణ : రెండు తెగలవారికిని పోరు మున్మురముగ సాగినది. మనకువలె వారికిని ఆధునిక మారణాయుధములు కొల్లలుగ నున్నవి. కోట బలవత్తరము నున్నది. వారి సైన్యము మన సైన్యమున కంటె దాదాపు రెట్టింపున్నది.

తిమ్మ : అధిక సైన్యమునకై వర్తమానించక పోయినారా ?

గూఢ : అట్టిపని అసమర్థతాద్యోతకమగునని ఊహించినారు నాగమ నాయకులవారు.

సోమం : బిరుదు బంటుగదా ! తగిన్లే యూహించినాడు.

కృష్ణ : మహాయోధులకు వలసినంత యాత్మబలమున్నవాడు ... సరియే.

గూఢ : అవధరింపుడు. మొదటి రెండు దినములు జరిగిన యుద్ధములో జయాపజయనిర్ణయము అసాధ్యమైపోయినది. దాదాపు మనవారికి మనోనిబ్బరము సన్నగిల్లినది. ఒక్క నాగమనాయకులవారి యచంచలమైన ఉత్సాహమూ, ప్రోత్సాహమూ, - తప్ప పరిస్థితులు ప్రమాదకరములుగ పరిణమించునట్లు కనుపించినవి.

విశ్వ : అంతవఱకు వచ్చినదా వ్యవహారము ?

గూఢ : మూడవరోజు మధ్యాహ్నమగుసరికి చోళబలగము పలాయనమున కారంభించినది.

తిమ : మంచిది తరువాత ?

గూఢ : రాజుగారిని తరిమి పట్టుకొని బంధించారు మన దళపతులు.

కృష్ణ : గొప్ప పనిచేసినాడు.

తిమ్మ : ప్రభు ఋణము తీర్చెను.

గూఢ : నన్ను తమ సన్నిధికి పంపి వారు వెంటనే బయలు
దేరి వచ్చుచున్నారు.

కృష్ణ : అప్పాజీ! ఈ విజయవార్తను తెచ్చిన గూఢచారిని
యథోచితముగ సత్కరింపుడు.

సామం : విజయనగరసామ్రాజ్య చరిత్రకు మఱియొక సువర్ణ
మయ ఘట్టము చేర్చబడినది.

తిమ్మ : నాగమ నాయకుల వీరవిహారము తెలుగుజాతి
గర్వింప దగినదిగాయున్నది. గూఢచారీ! విజయులై
వచ్చుచున్న వీరులకు, తోరణగల్లు వద్ద ఎదుర్కొని స్వాగత
మిచ్చుటకు తగిన ప్రయత్నములను చేయింపుము.

గూఢ : చిత్తము. (వెళ్ళాడు.)

కృష్ణ : నాగమనాయకుడు వచ్చిన తరువాతవిజయోత్సవమును
కూడా జరిపింతము.

తిమ్మ : మంచిది. అట్లే జరిగింతము.

(ప్రవేశం సేవకుడు)

సేవ : అశ్వారూఢులై నాగమనాయకులవారు దయచేసినారు
ప్రభూ!

కృష్ణ : నాయకు డప్పుడే వచ్చుచున్నాడా? అప్పాజీ! మహా
వీరుడు తగినట్లు గౌరవింపబడవలయును.

తిమ్మ : అవశ్యము.

(ఒక్క-రాయలు తప్ప తతిమ్మావారు లేచి ద్వారము వఱకు యెదురు నడిచివచ్చుచున్న నాగమనాయకుని ఆహ్వానిస్తారు. ప్రవేశం నాగమనాయకుడు.)

నాగ : మహామంత్రుల కభివాదనము.

తిమ్మ : నాయడా ! భద్రమగుగాక.

నాగ : సార్వభౌమా! విశ్వాసనీయ సేవకుడు నాగమ నాయడు పాదాభివందన మాచరించుచున్నాడు.

కృష్ణ : సామ్రాజ్యగౌరవమును కాపాడిన యోధాగ్రణీ !
(కూర్చుండుమని ఆసనమును చూపును.)

తిమ్మ : నాయడా! ప్రభువులు మీపై నుంచిన విశ్వాసమ్మును వేయిరెట్లు పెంచుకొనినావు.

నాగ : మహామంత్రులవారి కనుచలువలలో పెరిగిన మొలకలివి. విజయఫలముల కేమి కొఱత ?

తిమ్మ : స్వాధీనరాజ్య పరిపాలనమున కెట్టి యేర్పాటు చేయించితివి ?

నాగ : తాత్కాలికముగ నరసా నాయకుని నియమించితిని. తరువాత తమచిత్తము.

కృష్ణ : అప్పాజీ! నరసా నాయకు డింతపనికి చాలినవాడా ?

తిమ్మ : సంశయమే.

నాగ : నాకును ఆ సందేహ మున్నది. కాని నా యొద్ద

నున్న వారందరిలోనూ ఆయనరే విశ్వసనీయుడను కొన్నాను.

తిమ్మ : సందేహమేమి ? నీ నియామకమున తప్పులేదు. తగిన వారిని మఱియొకరిని నియమింతము.

సామం : ప్రభువులు అన్యథా భావింపకున్నచో నాదొక మనవి. సామ్రాజ్యమునందలి పీఠలలోనే కాక, మేధా వులలోనూ నాగమ నాయకులవారు అగ్రగణ్యులే యను కొందును.

తిమ్మ : అవును.

సామం : అసమాన ప్రతాపముతో మధురను జయించిన మహావీరునకే తత్పరిపాలనా గౌరవను కూడా లభించుట అన్నివిధములను శ్రేయస్కరమని నా యభిప్రాయము.

కృష్ణ : మండలేశ్వరుల యభిమతము సక్రమముగనేయున్నది.

తిమ్మ : ప్రభు కృపాపాత్రుడు నాగమనాయడు ధన్యుడు.

నాగ : (వినమితుడై లేచి) సామ్రాజ్యము నాపై చూపిన దయ, వాత్సల్యములు సాటిలేనివి. అందులకు నా కృత జ్ఞతా పూర్వక ప్రణామములు. కాని...అవి ధేయతయని భావింపకున్నచో నా ప్రార్థన మొకటి యున్నది.

కృష్ణ : అభ్యంతరమేమి ? చెప్పవచ్చును.

నాగ : ఏ మహోద్దేశముతో స్వామి విద్యారణ్యులవారి ఆశీ ర్వాద బలమున, విరూపాక్షస్వామి యనుగ్రహమున;

ఈ మహాసామ్రాజ్యము స్థాపింపబడినదో ఆ మహోద్దేశ నిర్వహణమే సామ్రాజ్య సేవకులకు విధ్యుక్త ధర్మము.

తిమ్మ : బాగున్నది.

నాగ : ఒక్క దక్షిణాపథము తప్ప తక్కిన భారతమంత యును తురుష్క ప్రభు పాదఘట్టితమైపోయినది. కార ణము మనయంతటివారు ఉత్తరమున లేరనికాదు. ఉన్న వారిలో నైకమత్యము లేదని.

కృష్ణ : వాస్తవము నాయడా! వీరాధివీరుడవైన నీవు ఉన్నత ముగ నూహించినావు.

నాగ : సస్యశ్యామలమైన విజయనగర సామ్రాజ్య కేదార ములో చోళప్రభువుల వంటివారు కలుపులవలె పెరిగి పోయినారు. ఇట్టి ద్రోహులు మాతృభూమికి భార కారకులు. అట్టివారిని పరిపారవేయుటకే యీ విధేయ సేవకుని ఉపయోగించుకొనవలసినదిగా అభ్యర్థించు చున్నాను.

విశ్వ : తండ్రిగారి యీ త్యాగమయ పథమే మా వంశమున కంతకును వెలుగుబాట యగునుగాక.

సామం : ఒక్క మీ వంశమునకే కాదు, తెలుగుజాతి సమస్తమునకును.

కృష్ణ : నాయడా! నీ యాదర్శమును నేము కాదనుటలేదు. మఱల మఱల నిట్టి స్వతంత్రులే ఉద్భవిల్లి సామ్రాజ్య

మునకు భారమగుచున్నారు. ఇదికూడా నీ యుద్దేశ నిర్వాహణములలో నొకటి కదా !

నాగ : చిత్తము.

కృష్ణ : నీవు మధురలో నుండు నంతకాలము యిక్కడ నీ కుమారుడైన విశ్వనాథ నాయకుడు మీా కార్య క్రమమును చూచు చుండును.

నాగ : నా పేద హృదయము తమ వాత్సల్యామృతముచే నిండి పొంగిపోవుచున్నది మహారాజా! ఆమరణాంతము, కాదు...ఒక్క జన్మయేమి ? యెన్ని జన్మముల నెత్తి ననూ యీా నాగమ నాయకుడు ప్రభుసేవకుడయి, విశ్వాస నీయుడై తరించును.

తిమ్మ : రేపు విజయోత్సవానంతరము నీకు అధికార పత్రి మొసంగబడును.

నాగ : చిత్తము.

సామం : స్వామాట్టులకు ప్రతినిధులుగ అచంచల కార్య దీక్షాతత్పరులై దేశక్షేమ సంధాయకులు అగుదురుగాక.

తిమ్మ : తథాస్తు.

(తెర)

# రెండవ రంగం

ప్రదేశం : మధుర సభాంగణము.

(తెరయెత్తగా నాగమనాయకుడు, అంబయ శర్మలు కూర్చొని యుంటారు.)

నాగ : అంబయశర్మగారూ ! మీరు తెచ్చిన వార్తలేమి ?

అంబ : తమ ఆజ్ఞానుసారం తంజాపుర, మధుర రాజ్యములలో సంచారం చేశాను.

నాగ : విశేషములు ?

అంబ : ఎక్కడ చూచినా తమ పౌరుషగాథలే చెప్పుకుంటున్నారు. పూర్వపు రాజైన చంద్రశేఖర పాండ్యుని విపరీతంగా ద్వేషిస్తున్నారు.

నాగ : కారణం ?

అంబ : ఆయన అసమర్థుడని, స్త్రీ లోలుడని, పిరికియని...

నాగ : (మౌనం)

అంబ : అట్టివాని పాలనమునే తిరిగి ప్రతిష్ఠించుటకు ప్రజలు సుముఖులుగా లేరు.

నాగ : రాజశాసనముగదా ?

అంబ : కనుకనే సమర్థతయుండి కూడా చేతులు ముడుచుకోవలసి వచ్చినది.

నాగ : అనగా...

అంబ : యథార్థం చెప్పాలంటే పేరునకు మాత్రమే చంద్ర శేఖరు డధిపతిగాని వాస్తవమునకు తమ రేకదా ప్రతి నిధులు.

నాగ : మన ప్రతినిధిత్వము రాజ్యమున పరిస్థితులు ప్రశాంత పడునని కేగదా ?

అంబ : ప్రజలు అట్లు ఊహించుట లేదు.

నాగ : అది మీకు మాపైనున్న అభిమాన చిహ్నము మాత్రనే.

అంబ : కాదు ప్రభూ ! నేను ఒక్కడనే అయితే తమరట్లు ఊహించుకోవచ్చు. కాని లోకమంతా ఒకే భావంలో వుంటే...

నాగ : లోకము గ్రుడ్డిది.

అంబ : అది పూర్వపు మాట.

నాగ : అవును. నేటికి విద్రోహము పెరిగినది కనుక...

అంబ : విద్రోహము పెరుగుటయా ? శక్తిని విస్మరించు టయా ?

నాగ : మీలోకూడా ఆ విద్రోహాంకురములు పొడసూపు చున్నట్లున్నవి.

అంబ : ఎవరిమీద ఆ విద్రోహము ?

( ప్రవేశం నరసానాయకుడు )

నాగ : నరసయ్యగారూ ! మీరు తెచ్చిన వార్తలేమి ?

నర : రాజ్యమున ప్రశాంతత వేరూనుకొనుచున్నది. విద్రోహుల కుటిల ప్రయత్నములు దాదాపు తుడిచిపెట్టబడినవి.

నాగ : సరే. చంద్రశేఖరు లేమనుచున్నారు ?

నర : సర్వభారమునూ తమరే వహించుచున్నారని, నిశ్చింతగా నున్నారు.

అంబ : నిశ్చింతగా వుండరా మరి ? అర్హులకు కాక అనర్హులకు రాజ్యపదవి నంటగట్టిన వారిని అనాలిగాని.

నర : ఏమంటున్నారు ?

అంబ : ఏమంటున్నానా ? యోగ్యతా యోగ్యతలు విచారించక . . .

నర : (ఆపి) అంబయగారి మాటలు ప్రభునిందాపాదకములు.

అంబ : అమంగళం శమించాలి. నేను చెప్పినది సామాన్య విషయాన్ని గురించి. వ్యక్తిదూషణం నా భావంకాదు.

నర : మీరు కొంచెము తెలిసి ప్రవర్తించుట మంచిది. ఇది శ్రీ రాయలవారి ప్రభుత్వము.

అంబ : ఓహో ! రాయలవారి ప్రభుత్వమని బెదరించటానికి తెలియని వారెవరు ? ఎవరి విషయం వారికి తెలియక పోవచ్చు.

నాగ : ఆగండి శర్మగారూ! తెలియనివారు తెలియనట్లూర కొనరాదా? మీకు వాస్తవముగా తెలియనంతమాత్రాన మీ వాక్కులు దోషాపాదకములు కాకపోవు.

అంబ : ఇదేమి పాపము. దోషమంటే అంత తేలికగా సంక్రమిస్తుందా? అయినా ప్రభువులకు కోపం వచ్చింది కనుక నా భావం నిర్దుష్టం అని మనవిచేస్తున్నాను.

నాగ : మీరు పూర్వపు రాజులవద్ద పోయిన పోకలనే పోవుచున్నారు. మార్చుకొని తీరవలయును.

అంబ : కనుకనే మహారాజుల కత్తికి రెండువైపులా పదునుంటుందని శాస్త్రం.

నాగ : ఇందు మహారాజు లెవరు ?

అంబ : ఈరోజున లేచినవేళ మంచిది కానట్లుంది. ప్రజలను శాసించేవారిని రాజులనకూడదన్నమాట? వారిపై వారు యింకెవరో ఉంటారన్నమాట!

నర : (ఉద్వేగంతో) చాలించండి ఉన్మాద సూచక ప్రసంగాన్ని.

నాగ : శర్మగారూ! మీకు తెలియదా ప్రభువు లెవరైనది?

నర : విద్రోహులకు తెలియవలసిన పని యేమున్నది ?

అంబ : నరసా నాయకులవారూ! ఇందులో విద్రోహు లెవరూలేరు. అందరినీ అనుమానిస్తుంటే యీరాజ్యంలో

మీావారనబడేవారు ఒక్కరూ ఉండను. అయినా మా కెందు కీబాధ. అసలు వారు మీాకే నేము రాజులం కాము, ప్రభువులంకాము, మా కధికారం లేదు, మేము సేవకులం అంటుంటే మా ముల్లేంపోయింది? మేమూ అట్లాగే అంటాం.

నాగ : మా చనవును దుర్వినియోగ పఱచుకొన్నచో శిక్షాపాత్రులు కావలసి వచ్చును. జాగ్రత్త.

అంబ : చిత్తం-చిత్తం! ఇంతకాలం మహారాజుల పాద సన్నిధిలో వుండి, వారి శాసనాలకు, ఆజ్ఞలకు అలవాటు పడ్డ ఘటాలం కనుక అపరాధం జరిగింది. క్షమించండి.

(భట్టుమూర్తి యొకడు ప్రవేశిస్తాడు)

భట్టు : తంజాపుర రాజ్య సంస్థాపనాచార్యా! జయీాభవ! మధురరాజ్య పరిపాలనాధినాధా! విజయీాభవ!

నాగ : (విసుగుతో) చాలించు నీ కైవారమును! ఎవడవు నీవు?

భట్టు : నా కైవారంలో దోషమున్నదా? మహాప్రభూ!

నాగ : అధిక ప్రసంగీ! ఇందు మహా ప్రభువెవ్వరు? అంబయ శర్మా! ఏమిటీ విరుద్ధము?

అంబ : ఓయి దేవుడా! ఉరుముురిమి మంగలం మీాద పడి నట్లుంది. ఓయి వైతాళికా! మహానుభావా! ఎవడ వయ్యా! నీవు?

నర : సంగనాచితనమును మాని యధార్థాన్ని తెలియ జేయండి. మీకు తెలియదా యితడెవడో ?

అంబ : నేను పుట్టిన తరువాత యితని మొగాన్ని చూడలేదు. మీరంతా చూచినట్లే నేనూ చూస్తున్నాను. అంతే. నిశ్వసించండి.

భట్టు : వాస్తవంగా నేనీ రాజ్యానికే క్రొత్తవాడను. అక్కడక్కడా విని తెలుసుకొన్న విషయాలనే కైవారంలో చెప్పుకొన్నాను. ఈ మధుర రాజ్యాన్ని జయించినది నాగమనాయక మహారాజులని విన్నాను. వారే తమ రనుకొని భ్రమించినాను. కాకున్న క్షమించండి. ఆ ప్రభువులకే కైవారం చేస్తాను.

నాగ : ఏమిరా? నాగమనాయుడు మహారాజని యెవరైనా చెప్పినారా?

భట్టు : ఒకరు చెప్పటాని కేమున్నది. లోకం అట్లా అనుకుంటున్నది.

నర : చాలించు వ్యర్థ ప్రసంగము లోక మనుకొనుచున్నదా? అసత్య ప్రలాపీ! లోకమనగా నెక్కడున్నది?

భట్టు : నేను పొరపడినచో క్షమించండి. నా దోష మేనో చెప్పకుండగనే దూషిస్తున్నారు. నేను నాగమనాయక ప్రభువులతోనే మొఱపెట్టుకుంటాను. లేక తమరే సెలవిస్తే దిద్దుకుంటాను.

నాగ : దిద్దుకొందువా ? పాప పంకిలమును రుద్దుకొందువా ? ఎవరచట ?

( ప్రవేశం సేవకుడు )

సేవ : చిత్తము స్వామీ !

నాగ : ఈ ప్రలాపిని బంధించుము. అంబయ్యా ! మీకు ఈ కుట్రలలో భాగములేదని మమ్ము నమ్మించిన తరువాతనే మా లోపలకు రాతగుదురు.

అంబ : హరహరా ! ఓ వైతాళికా ! నీవు చచ్చి, నన్ను చంపినావయ్యా ! ఇప్పటికైనా నిజంచెప్పు. నీకీ దుర్బోధ చేసిందెవరు ?

నాగ : ఆ విచారణ తరువాత.

నర : అంబయ్యా ! పాముతో చెలగాట మాడుతున్నావా? ఎదుటి శక్తిని గుర్తించక నోటికి వచ్చినట్లు మాట్లాడిన చెల్లుననుకున్నావా ?

అంబ : అందుకే తగినశాస్తి జరిగింది. అనుభవిస్తున్నాను. రాజులు మారినప్పుడల్లా ధర్మాలుకూడా మారుతుంటాయని యిప్పుడు తెలుసుకుంటున్నాను. రాజును రాజంటే బూతు. అధిపతిని గౌరవించటం అపరాధం. ఇది యిప్పటి ధర్మం. నావల్ల అపరాధం లేదని మీరు గ్రహించినప్పుడే తిరిగివస్తాను. పద వైతాళికా ! నీవు కారాగృహానికి—నేను స్వగృహానికి !

సేవ : చాలు చాలు, నడవండి.

(సేవకుడు, అంబయశర్మ, భట్టు నిష్క్రమణ)

నర : అధ్యక్షా ! ఇది కుట్రవలె కనుపించుటలేదా ?

నాగ : కుట్ర !...

నర : కాకున్న యింత నిరాఘాటమైన సమాధానములా ? ఏమిటి తమరు ఆలోచించుచున్నారు ?

నాగ : ఈ కుట్రయేమిటి అని !

నర : నాకాజ్ఞాపింపుడు. పరిశోధించి విద్రోహులను తమ కప్పగింతును.

నాగ : సరియే...మీరా ప్రయత్నములో నుండవచ్చును.

నర : చిత్తము. (వెళ్తాడు)

నాగ : (లేచి తిరుగుచు) ఇదియేమి విచిత్ర సంఘటనము ? నాగమనాయడు మహారాజా ?...లోకమంతయు నిట్లను కొనుచున్నదా ?...వాస్తవమేనా ? ... ఛీ! లోకమింత గ్రుడ్డిదా ?...

(ప్రవేశం సేవకుడు)

సేవ : జయము జయము మహారాజా ! (అని నోరు నొక్కు కొని) మహానాయకా !

నాగ : మీలో పూర్వపుటాచారము లింకను పోయినట్లు లేదు.

సేవ : (భయంతో) క్షమించండి, అపరాధిని.

నాగ : ఉదయమునుండియు ఇట్టి యపరాధములే జరుగుచున్నవి. కానిమ్ము.

సేవ : పూర్వపు రాజులకడ ప్రధాన గూఢచారి, వారి కాలోచనము చెప్పువాడు, సుందరేశ్వరుడు పట్టుబడ్డాడు.

నాగ : మంచిది. ప్రవేశపెట్టుము.

సేవ : చిత్తము. (వెనుకకు నడుస్తూ వెళ్తాడు.)

నాగ : ఇది యెంత గొప్ప యాచారము ? నిజముగా "నావిష్ణుః పృథివీపతిః" అనుట యెంతఅన్వర్థమయినది. రాజగుటకు ఎన్ని జన్మముల పుణ్యములు పండవలెనో ?... ఈ రాజ శబ్దమేమి ? దయ్యమువలె పట్టి పీడించుచున్నది.

(సేవకుడు సుందరేశ్వరునితో ప్రవేశము)

నాగ : ఇతడేనా సుందరేశ్వరుడు ?

సుంద : నడుమంత్రపుసిరి నరాలమీద కురుపులాగున్నది. ఎంత ప్రభువులయినా తారతమ్యం తెలిసికొని మాట్లాడతారు.

నాగ : నోరుముయ్యి.

సుంద : నోరుకూడా మా స్వాధీనంలో ఉండకూడదన్నమాట.

నాగ : బందీకింత కండకావరమా ?

సుంద : ఎవడు బందీ ? ... ఇవ్వాళ నేను, రేపు నీవు. కాలము మాత్రమే అవధి.

నాగ : బ్రదుకుపై ఆశలేదా ?

సుంద : ఆశ ?... దేనికోశం బతకాలి ?... బతికి ఏం పీకు తినాలి ?... అంబలి తాగేవాడికి మీసాలు ఎత్తిపట్టే వాడింకొకడు. తెగించినవాడికి సముద్రం మోకాటిబంటి. రాజుగారి మోచేతికింద నీళ్ళుతాగే బంటుగారికే యింత అధికారముంటే, స్వతంత్రులం, విద్యావంతులం, మాకెంత వుండాలి.

నాగ : ఇంత తెగించుటకు కారణము ?

సుంద : అభిమానం.

నాగ : స్వతంత్రుడవు, విద్యావంతుడవుకదా ! మీ అభిమానానికి అభ్యంతర మేమి కలిగినది ?

సుంద : నానోటితో చెప్పింతువా ? యథారాజా ! తథా ప్రజ ! అన్నారు. కాతుకొద్దీ గుజ్జం అంటారు. మహారాజులు మాత్రమే అధివసించదగిన సింహాసనంమీద... బానిస!...రాజులుమాత్రమే శాసించదగిన రాజ్యానికి... సేవకుడు శాసనకర్త! ... సర్వతంత్ర స్వతంత్రులైన ప్రభువుల స్థానంలో...స్వాతంత్ర్యశూన్యుడైన బంటు!...

ఇక ధర్మాధర్మ నిర్ణయమేమి !...యుక్తాయుక్త విచక్షణ యేమి?...మాబోటి యభిమానవంతుల బ్రతుకేమి?...

నాగ : చాలించు ద్రోహీ!...రాజ ధిక్కార నేరమునకు... మరణశిక్ష.

సుంద : (వికటంగా నవ్వి) అహహాహా ! మరణశిక్ష !... రాజధిక్కార నేరమా ! ఎవడు రాజు? ...... ఎవడు ధిక్కారి? ...ఇంతేనా నీవు వేయదగిన శిక్ష !...నిన్ను నేను ధిక్కరిస్తున్నాను. ప్రజలను శిక్షించటానికి నీవేమి రాజువా? ... ప్రాడ్వివాకుడవా? ... నామమాత్ర సేవకుడవు? ... శాసిస్తావా? ... మీ ప్రభువులతో మా ద్రోహమేమిటో విన్నవించుకో. నీకున్న అధికార మెంత?

నాగ : (మహాకోపంతో) ఊం ! (అని సైనికునకు సైగ చేస్తాడు.)

సేవ : (బలవంతంగా నెట్టుకొని పోతాడు.)

నాగ : (పచారుచేస్తూ) ఆజ్ఞా తిరస్కారము? ... ఎంత పరాభవమిది ! ... బానిస యధికారమా? ... ఛీ ! ఛీ ! ... ఎంత తేలికయైన యధికారము? ... (తిరిగి) నేనే సర్వాధికారిని ... నాయాజ్ఞకు తిరుగులేదు ... ఎవరచట?

( ప్రవేశం సేవకుడు )

సేవ : చిత్తము మహారాజా ! (సగంలో ఆపి తెములుకొని) మహానాయకా !

నాగ: ఛీ! ఛీ! నీకును తేలికయైనానా? ... పో యిక్కడి నుండి.

సేవ: చిత్తం. (భయంతో వెళ్తాడు.)

నాగ: మర్యాదార్హుడు కాని వానికి సంక్రమించిన రసాభాసపు మర్యాదయిది ... దుర్భరము. (పోబోగా ఎదురుగా "మహారాజ సింహాసనంమీాద బానిస" అని వినిపిస్తుంది.) ఆఁ! ... ఎవరు వారు! బానిస యెవడు? ... ఎవడురా బానిస! ... (అని వెనుదిరుగగా "రాజులకు బదులు సేవకుడు శాసనకర్త" అని వినిపిస్తుంది.) ఛీ! దుర్మదుడా! ఎవడురా సేవకుడు? ... (మఱియొక వైపునకు తిరుగగా "ప్రభువుల స్థానంలో స్వాతంత్ర్య శూన్యుడైన బంటు" అనివినిపిస్తుంది.) బంటు! ... కాదు ... అధికారి! ... (ఇంకొక వైపునకు తిరుగగా "నీవేమి రాజువా, ప్రాడ్వివాకుడవా" అని వినిపిస్తుంది.) ఛీ! ఛీ! ఇది యెక్కడి పైశాచిక బాధ? ... (ఆలోచించి) వాస్తవము ... ఒకరికి సేవకుడు ... మఱియొకరికి ప్రభువు ... సత్యము. ఇది విరుద్ధసమస్య. అందుకే అంబయశర్మ అట్లన్నాడు. ఎవడురా అక్కడ?

(ప్రవేశం సేవకుడు)

సేవ: చిత్తము.

నాగ: అంబయశర్మను తక్షణము రమ్మను.

సేవ : (భయంతో) అంబయగారినా?

నాగ : పునరుద్ఘాటనమా?

సేవ. లేదు ప్రభూ. (వెళ్తాడు.)

నాగ : (తర్కిస్తూ) ప్రభువు ! ... ప్ర ... భు... వు !

( ప్రవేశం అంబయశర్మ )

అంబ : నాగమనాయడా ! ఏమి మఱల పిలిపించితివి?

నాగ : (తలయెత్తి) నామ సంబోధనమా?

అంబ : తమరే సెలవిచ్చారు కదా ! మంత్రులంకాము, రాజులంకాము, కేవలం ప్రతినిధులమని.

నాగ : ఊఁ.

అంబ : మఱల యిదికూడా అపరాధమేనా?

నాగ : కాదా?

అంబ : పాడుబ్రహ్మ. మాకు నోరు, మాటా రెండూ యివ్వకుండా వుంటే బాగుండును. కనీసం ... మానవధర్మం.

నాగ : మానవధర్మం ?...

అంబ : కాక ! ఆవేశించిన రాజ్యాధికారం మానవత్వాన్ని బలిగొంటుందా?

నాగ : మానవత్వమేమి? రాజత్వమేమి? రెండూ విరుద్ధములా?

అంబ : కావా మఱి. కాని, యీ రెంటికీ ప్రధానమైనది ధైర్యము.

నాగ : అనగా......

అంబ : సైనికునకు కావలసిన ధైర్యం వేఱు... స్వాత్వమును నిలుపుకోదలచిన వానికి కావలసిన ధైర్యము వేఱు. ఒకదానికి దేహబలం, రెండోదానికి ఆత్మబలం కావాలి.

నాగ : (హాసం)

అంబ : ఆత్మబలం కావాలంటే సాంప్రదాయం ఉండాలి.

నాగ : శర్మా !

అంబ : ఎవరికి ఆత్మబలంలేదో, వారికి సంప్రదాయంలేదు.

నాగ : అసంబద్ధము.

అంబ : ఎవరి జీవితం అసంబద్ధాలతో బద్ధమైవుందో తెలిసికో నంతటి విజ్ఞులా మా రాజప్రతినిధి ?...

నాగ : రా-జ-ప్ర-తి-ని-ధి (తర్కిస్తాడు)

అంబ : రాజ్యాన్ని జయించింది మీరు. పాలిస్తున్నది మీరు. అధికారులు మీరు.

నాగ : ఆగు.

అంబ : ఆగక సాగుచున్నానా ? ఎందుకీ కంఠశోష ? నన్నెందుకు పిలిపించావు ?

నాగ : ఎవరు పిలిపించారు ?

అంబ : సరే పోవుచున్నాను.

నాగ : నిలువు.

అంబ : ఏమిటి నామీద మీ యధికారము ?

నాగ : అదే నిర్ణయము కావలయును.

అంబ : అది ఏమంత బ్రహ్మాండ విషయమా ? కావాలంటే క్షణం.

నాగ : ఏమంటావు ?

అంబ : ఏమంటాను ? నాగమనాయకుడే మధురనాయక రాజవంశానికి మూలపురుషులు కావాలంటాను. శ్రమకు, యోగ్యతకు తగిన ప్రతిఫలం అనుభవించాలంటాను.

నాగ : పద.

అంబ : శుభం భవతు. (ఆశీర్వాదిస్తుండగా)

(తెర)

# మూడవరంగం

ప్రదేశము : విజయనగర సభాంగణం.

(ప్రవేశము రాయలు, తిమ్మరుసు, నరసానాయకులు)

కృష్ణ : నరసానాయకా ! నీవు తెచ్చిన వార్తలేమి ?

నర : చెప్పతగిన దేమున్నది మహారాజా ! సర్వము తల క్రిందులు కానున్నది.

తిమ్మ : అంత విశేషమేమి ?

నర : రాజ్యమే మననుండి జారిపోవనున్నది.

తిమ్మ : నాగమనాయడు లేడా ?

నర : కంచెయే చేను మేయదలచినది.

కృష్ణ : నాగమనాయడే వ్యతిరేకియా ?

నర : ఆయన యుద్దేశములు పూర్తిగ మారిపోయినవి. మధుర తంజాపుర రాజ్యములకు తాను రాజు కావలయు నని యూహించుచున్నాడు.

కృష్ణ : ఇంతటి మార్పెందులకు వచ్చినది ?

తిమ్మ : రాజ్యలోభము.

నర : ఒక రాజ్యలోభమని చెప్పటకాదు. పుత్రమోహము కూడ కలసినది.

కృష్ణ : అంతటి యభిమానమా ?

నర : పుత్రుడు చక్రవర్తి కావలయునని యూహ.

తిమ్మ : ఈ యూహల కేమి ? తగినంత యాధారమున్నదా ?

నర : నాయాధార ప్రదర్శనములతో నిమిత్తము లేకుండనే తమకు విశదమగు దశకు చేరినది వ్యవహారము.

కృష్ణ : ఎంతటి విశ్వాస ఘాతుకము ?

తిమ్మ : ప్రభువుల యండ యున్నది. చేతిలో యధికారము, ధనము, సైన్యము కూడా యున్నవి కదా ?

కృష్ణ : నాగమనాయడే యింతటి ఘోరమునకు పాల్పడి నప్పుడు, ఇక విశ్వసింప దగిన వారుందురా ?

తిమ్మ : రాజనీతికి విశ్వాసము విరోధి. అట్లని నమ్మకుండుట కును వీలులేదు.

కృష్ణ : (తర్కిస్తూ) రా–జ–నీ–తి !

నర : ప్రభువుల దయను మఱియొక విధముగ నర్థముచేసి కొనినాడు.

తిమ్మ : అనుభవించును. ఇందు సహాయకులు, కారకులు కూడా నున్నారా ?

నర : రాజ్యమంతయు ప్రశాంతముగనే యున్నది. చెప్పు కొన దగినట్టి బలనంతులుకూడా లేరు. కేవలమిది యాతని మనోభావము మాత్రమే.

కృష్ణ : నమ్ముటకు వీలులేదు.

తిమ్మ : (ఆలోచించి) సరే, పూర్వరాజులు, వారిమంత్రులు ఎవయినను ఆలోచన చెప్పకూడదా?

నర : లేదు. నేను సాధ్యమైనంతవరకు పరిశోధించితిని. పూర్వ ప్రభువుల రహస్యోద్యోగి అంబయశర్మ యొకడు.

కృష్ణ : అతని విషయమేమి?

నర : సమయస్ఫూర్తిగ మాటలాడగలడు. ఎదుటివారు ఎంతటివారైననూ నమ్మించి వశము చేసికొనగలడు.

తిమ్మ : సరియే.

నర : సుందరేశ్వరుడని కవులలో నొకడున్నాడు. ఈ యిరువురును కలిసి ప్రోత్సహించినారు.

కృష్ణ : కేవలము ప్రోత్సాహమే యింత సాహసమునకు కారణమా?

నర : అసలు బుద్ధియు మారిపోయినది.

తిమ్మ : తెలిసి నీవేల యుపేక్షించితివి?

నర : ఆరంభమున నాగమనాయకులవారే తగు చర్యలను తీసికొన్నారు. ఒకరికి బహిష్కారశిక్ష, మఱియొకరికి మరణశిక్ష.

కృష్ణ : అంతవఱకును సక్రమముగనే యున్నది.

నర : తరువాత మఱుక్షణముననే ఆ రెండు శిక్షలును రద్దు చేయబడినవి.

తిమ్మ : ఇప్పుడు వారి వ్యవహార మెట్లున్నది ?

నర : ఆంతరంగికులలో ప్రథములు.

తిమ్మ : సరియే అర్థమైనది. ఒఱకుమించిన కత్తియైనది. సేవకత్వమున కలవాటు పడిన హృదయము పాలకత్వ మర్యాదలకు లోభపడినది.

నర : సరిగా నట్లేజరిగినది. వందిమాగధస్తోత్రములు, వైతాళికుల కైవారములు, రాజలాంఛనములు, కవుల పొగడ్తలు ముమ్మరమై మత్తెక్కించినవి.

కృష్ణ : పుత్రుని సమ్మతిమీదనే యిది జరిగి యుండ వచ్చునా ?

తిమ్మ : అసంభవము.

నర : నాకు తెలియదు. కాని అట్టిది జరిగియుండదని నా నమ్మకము.

తిమ్మ : మన సైన్య మెట్లున్నది ?

నర : ఈ నిప్పు దానికింకను అంటలేదు.

కృష్ణ : అదియు నేడో రేపో సంభవము కావచ్చుగదా ?

తిమ్మ : సందేహమేమి ?...ఎవరచట ?

(ప్రవేశం సేవకుడు)

సేవ : చిత్తము.

తిమ్మ : విశ్వనాథ నాయకుని తక్షణము రమ్మను.

సేవ : చిత్తము. (వెళ్తాడు.)

తిమ్మ : నరసానాయకా! నగరమునగల సామంత ప్రభువులను సభాంగణమునకు రప్పింపుము.

నర : చిత్తము. (వెళ్తాడు.)

కృష్ణ : కర్తవ్యమేమి అప్పాజీ!

తిమ్మ : నాగమనాయని బంధించి తెచ్చినవారికి బహుమతిని ప్రకటింతము.

(విచ్చుకత్తితో విశ్వనాథ నాయకుడు ప్రవేశం.)

విశ్వ : (లోపలినుండే) నాతండ్రిపై రాజద్రోహ మారోపించిన దురాత్ముడేడి? ఆ స్వార్థ పిశాచి యెక్కడ? (అనుకుంటూ ప్రవేశిస్తాడు).

తిమ్మ : శాంతింపుము విశ్వనాథా! ఇది ప్రభు సన్నిధి.

విశ్వ : (తగ్గి) ప్రభువులకు, మహామంత్రులకు పాదాభివందనములు. ఈ అసత్యవార్త, ఈ నీలాపనింద, తమవఱకు రాలేదా ప్రభూ? నా జనకుని విద్రోహియని, విశ్వాస ఘాతకుడని ప్రకటించుచున్న నరసానాయకుడు రాలేదా మహామంత్రీ!

కృష్ణ : విశ్వనాథా !

విశ్వ : క్షమింపుడు మహారాజా ! నా హృదయము పగిలి పోవు చున్నది. క్రోధావేశమున నొడలు మఱచు చున్నాను. ఈ అభూత కల్పనమేమి ప్రభూ ?

తిమ్మ : అభూత కల్పనము కాక సత్యమే అయినచో.

విశ్వ : సత్య మగునా ? అసంబద్ధము మహామంత్రీ ! అట్లగు టకు వీలులేదు. అగ్నికి చెదలంటునా ?

తిమ్మ : అది తడిసిపోయిన దేమో ?

విశ్వ : అమాత్యా ! అట్టిదియు జరుగదు. మా వంశమున యింతవరకు కృతఘ్నులు, ద్రోహులు పుట్టలేదు. భూదేవి నిలువునా బ్రద్దలు కావచ్చు, నక్షత్రాలు రాలవచ్చు, కాని నాతండ్రి కృతఘ్నుడు కాడు.

( ప్రవేశము సామంత, దండనాయకులు )

సామం : మధురవార్త సత్యమా అప్పాజీ !

తిమ్మ : ఆ విషయము కొద్ది క్షణములలో నిర్ణయింపబడ గలదు. కూర్చొనుడు.

( అంతా కూర్చుంటారు )

కృష్ణ : మా భువన విజయ సభాంగణ మింతవఱకును రాజ ద్రోహ వాతావరణముచే కలుషితము కాలేదు.

సామం : సత్యము మహారాజా !

తిమ్మ : ఇప్పుడు కానున్నది.

సామం : నాగమనాయని యంతటి రాజభక్తుని గూర్చి యేనా మీ యనుమానము ?

తిమ్మ : అనుమానమే ప్రమాణమైనచో.

సామం : తప్పేన దేమున్నది?

కృష్ణ : నాగమనాయకుడు రాజభక్తుడు, వీరాధివీరుడు. కను కనే ఈ కార్యమునకు పాల్పడినాడు.

తిమ్మ : ఇంతమంది యోధానుయోధులు; సామంత మండలే శ్వరులు కలిగిన యీ సభలో నాగమనాయనిసాటి వీరు లున్నారా యెవరైనా ?

( సభ అంతా మౌనం )

కృష్ణ : సామ్రాజ్యమే గొడ్డుబోయినదా ?...ఇంత వీరత్వ శూన్యమా మా సామ్రాజ్య సైన్యము ? ... ఇంతటి యల్పులా మా దండనాయకులు ?...వీరిని నమ్మికొని యేనా మా పరిపాలనము ?

( సామంతులందరూ ఒకేసారిగా "సార్వభౌమా !" యని అంటారు )

కృష్ణ : ఈ పయోముఖ విషకుంభముల నడుమనా మా యునికి ?

( ప్రవేశం సేవకుడు )

సేవ : జయము జయము మహారాజా ! మధురనుండి గూఢ చారి వచ్చినాడు.

కృష్ణ : విషకుంభము బ్రద్దలయినదేమో ?...రమ్మను.

( సేవకుడు లోపలికి వెళ్ళి గూఢచారితో మరల ప్రవేశించును )

గూఢ : జయము మహారాజా !

తిమ్మ : అంత ఆయాసపడి వచ్చితివేమి ? నాగమ యెట్లు న్నాడు.

గూఢ : (సందేహిస్తూ) మనవి చేసుకుంటాను.

కృష్ణ : నిరభ్యంతరముగ చెప్పవచ్చును. మా చర్చించు విషయము కూడా నదియే.

గూఢ : నాగమనాయకుల వారు స్వాతంత్ర్యాన్ని ప్రకటించు కొన్నారు.

( సభలోని వారందరూ ఒకరి మొగం ఒకరు చూచుకుంటారు )

కృష్ణ : విశ్వనాథా ! ఏ మందువు ?

విశ్వ : (తలవంచుకుంటాడు.)

తిమ్మ : సభాసదుల యెదుట కర్తవ్య నిర్ణయము నుంచు చున్నాము.

( సభ మౌనం )

కృష్ణ : స్వామిద్రోహి, విశ్వాసఘాతకుడు, కిరాతకుడు ఐన నాగమనాయని ప్రాణములతో బంధించి తీసుకొని రాగల వీరులు ఎవరైనా ఉన్నారా ?...అట్టి వీరుడు యీ నా ఖడ్గమును గ్రహించ నర్హుడు. (ఒరలోనుండి కత్తిని దూసి) మహావీరులారా ?...

( సభాసదులు ఒకరి నొకరు చూచుకుంటారు )

కృష్ణ : సమర్థులు లేరా ?...

విశ్వ : (లేచి శిరస్సు వంచి) ఉన్నాను మహాప్రభూ !...ఎవని పుట్టువుచే మా నాయక వంశము కలుషితమైనదో ?.... ఎవని కృతఘ్నతచే కరుణామయులైన ప్రభువుల కింత మనోవ్యథ కలిగినదో ?....ఎవని ప్రవర్తనచే సామ్రాజ్య రమాపురంధ్రి దుర్బల యైనదో ?.... అట్టి నాగమ నాయకుని పుత్రుడగు యీ విశ్వనాథ నాయకుడు ప్రతిక్రియచేసి వంశగౌరవమును పునరుద్ధరించుకొనును. దయ చేయండి సార్వభౌమా ! ఈ మహాఖడ్గము రాజద్రోహి గుండెల నెత్తురు త్రావి శాంతించుగాక. దయచేయించండి మహాప్రభూ !

( విశ్వనాథునకు జయమగుగాక అని కేకలు )

కృష్ణ : విశ్వనాథా ! సరిగా ఆలోచించియే మాట్లాడుచున్నావా ? తాత్కాలికావేశవశుడవు కాలేదుగదా ! జాగ్రత్త.

విశ్వ : సంపూర్ణముగ ఆలోచించియే మనవి చేయుచున్నాను.

తిమ్మ : ఇది తండ్రితో పోరు సుమా !

విశ్వ : కాదు. కృతఘ్నునితో.... దేశద్రోహితో....

కృష్ణ : సంతోషము. (కత్తి నిస్తూ) ఇదిగో ! పితృఋణము, ప్రభువు ఋణము తీర్చికొనుము.

విశ్వ : (తలవంచి) మహా ప్రసాదము. (అని కత్తిని స్వీకరిస్తుండగా)

( తెర )

# నాల్గవ రంగం

ప్రదేశము ! మధుర రాజభవనం.

(అంబయశర్మ, సుందరేశ్వరులు కూర్చుని యుండగా వంది మాగధ స్తోత్రములతో, రాజువేషముతో నాగమనాయకుడు ప్రవేశం)

వంది : మధురనాయక రాజవంశ సంస్థాపనాచార్యా ! పరాకు ! పత్యర్థిమత్తేభ కంఠీరవా ! బహుపరాకు ! మధురాపురీశ్వరా ! పరాకు ! శ్రీమన్మహామండలేశ్వర నాగమనాయక మహారాజా ! బహుపరాకు !

సుంద : ఈ స్తుతికోసం ఎంతకాలం తపించాము మహారాజా !

అంబ : అర్హులకు తగిన పదవి...పదవికి తగిన ప్రభువు.... ప్రభువులకు తగిన సేవకులు....

నాగ : ఇదియంతయు ప్రజల చలువ.

అంబ : అట్లుకాదు. మీవిలువ. ఎట్లా జరగాలో అట్లాగే జరిగింది. కష్టపడి యుద్ధంచేసి, రక్తమోడ్చి రాజ్యాన్ని సంపాదించటం మీవంతా ? కడుపులోచల్ల కదలకుండా ఠీవిగా అనుభవించటం రాయలవంతా ?

సుంద : ఎంత అన్యాయం, పైకి ధర్మప్రభువులమని చెప్పుకోవటం.... ఇలాంటి అన్యాయాలు చేయటం రాయలకే సరిపోయింది.

నాగ : దానికేమి. అంబయా మన యీ స్వాతంత్ర్య ప్రకటనను కుమారునకు తెలియచేయుటకు మీరు బయలుదేరుదురా ?

అంబ : అవశ్యము. నాకు అంతకంటె చేయదగిన పనులేమున్నవి మహారాజా !

నాగ : కాలము ఆసన్నమైన నాయట్టివానికి రాజ్యాభిలాష యేమిటి? నా కుమారునకే పట్టము కట్టవలసి యున్నది.

సుంద : మీ యభిప్రాయము ధర్మబద్ధమైనది.

నాగ : మూర్ధాభిషిక్తమునకై సప్తనదులలోని నీరమును తెప్పింపుడు. కుమారుని రాకను మీరు ముందుగా తెలియపరచినచో, కొంత దూరముననే ఎదుర్కొని రాజోచిత లాంఛనములతో తీసికొని రావచ్చును.

అంబ : చిత్తము.

నాగ : మఱి మీ ప్రయాణ మెప్పుడు ?

అంబ : ఎప్పుడు సెలవైతే అప్పుడు సిద్ధం. మీ కుమారులకు యీ శుభవార్త వినిపించవలెనని తొందరపడుచున్నాను మహారాజా !

నాగ : సుందరేశ్వరులు తగిన ముహూర్తము పెట్టింతురా?

సుంద : ముహూర్తమునకు భాగ్యమేమిటి మహాప్రభూ ! రామచంద్ర పట్టాభిషేక మహోత్సవానికి, వశిష్ఠులవారుం

చిన లగ్నమునకు వలె..(పాఠచారి) నహుషుని స్వర్గ లోకాధిపత్యానికి సప్తమహర్షులుంచిన ముహూర్తమున కంటె ....

నాగ : (విసుగుచు) ఆగు సుందరేశ్వరా! ఏమిటీ వింత ధోరణి. మతి పోవుచున్నదా ?

సుంద : (ఉలికిపడి) ఆ.... కాదు మహాప్రభూ! (దిద్దుకొనుచు) నా మనవి పూర్తిగా ఆలకించండి. ఆ ముహూర్తాలకంటె .... ఛీ! ఛీ! అవి యేమి ముహూర్తాలు .... దరిద్రాలు ....చిత్తగిస్తారుగా నా ప్రతిభాసామర్థ్యాల్ని.... మీ నాయక రాజవంశం చిరస్థాయిగా, కలకాలం, సూర్యచంద్రు లుండునంతకాలం ఉండిపోయే ముహూర్తాన్ని నిర్ణయిస్తాను.

అంబ : సుందరేశ్వరా ? నేను విజయనగరం వెళ్ళివచ్చిన తరువాత తగిన నిర్ణయం చేద్దాం.

సుంద : సరే.

అంబ : మహారాజా! నాకు విజయనగర ప్రవేశానికి వీలుంటుందా ?

నాగ : ఆలస్యము జరిగినచో అంత సుకరముకాదు.

సుంద : ఇప్పటికి తమ యీ స్వాతంత్ర్య ప్రకటనం చక్రవర్తులకు తెలియకుండా వున్నదంటారా ?

నాగ : ఇప్పటికి అంబయ్యోవచ్చు. కాని రేపయినను తెలియకుండదు కదం !

అంబ : అన్నిటికి సిద్ధముగానే వున్నాము కదా !

సుంద : అసలు తెలిస్తే మాత్రం ఏంచేస్తారు ?

అంబ : ఏమీ పాలుపోక రాజుగారూ, మొగం చెల్లక మంత్రిగారూ మీసమేషాలు లెక్క వేస్తుంటారు.

నాగ : మీకు రాజకీయములలో ప్రవేశము లేదు. కనుక సత్యదృష్టి మీకు లేదు. మహామంత్రి సామాన్యుడను కున్నారా ?

సుంద : అంతా కలిసి గొప్పవాడూ అని అంటే గొప్పవాడే అయి కూచుంటాడు. కాదంటే కానేకాదు. ఇదీ లోక వ్యవహారం.

అంబ : అన్నింటికీ అదృష్టం కలిసి రావాలి.

సుంద : అదృష్టమే. నిన్నటి వరకూ యీ అంబయగారు ప్రభు తిరస్కృతుడు. ఈ రోజు పురస్కృతుడు. దీని నే మంటారు ?

నాగ : అంబయగారి ప్రవర్తనా రహస్యమనకూడదా ? శక్తి సామర్థ్యాలు కాకూడదా ?

సుంద : అక్కడే వుంది రహస్యం. ఆశక్తి సామర్థ్యాలు ఒకప్పుడు ఊడి, మఱియొకప్పుడు కూడుతూ వుంటాయి కాబోలు.

( ప్రవేశం గూఢచారి )

గూఢ : మహారాజా ! విజయనగరమునుండి మహాసైన్య మొకటి బయలు దేరి మధురకై వచ్చుచున్నది.

అంబ : విజయనగరమునుండియా ?.... మహాసైన్యమా ?.... మధురకే వచ్చుచున్నదా ?.... మహారాజా ! ఇంత తొందరగా వారికి వర్తమానమెట్లు తెలిసినది ?

నాగ : అనుకొనినట్లే జరిగినది.... కానిమ్ము. గూఢచారీ ! ఆ సైన్యమునకు అధిపతి యెవ్వరు ?

గూఢ : ఎవ్వరోయేమి మహాప్రభూ ! విశ్వనాధ నాయకుల వారే.

నాగ : (విస్మయంగా) విశ్వనాథుడా ! మావిశ్వనాథుడేనా,

గూఢ : అవునుప్రభూ ! తమ పుత్రుడే.

అంబ : ఆఁ. ఇంతఘోరముంటుందా ?

నాగ : నా పుత్రుడు నాపైకే ఎత్తివచ్చుచున్నాడా ?

సుంద : తమకు విస్మయం కలిగిందా మహారాజా ! మన రొట్టెవిరిగి నేతిలో పడినట్లుంది.

నాగ : (విసుగున) అనవసర ప్రసంగము. సుందరేశ్వరా ! మా కుమారుని విషయమై మీ కనుభవములేదు.

అంబ : తండ్రీ కొడుకుల మధ్య తగాదాపెట్టి నాటక మాడుదా మనుకున్నాడు కాబోలు మహామంత్రిగారు.

నాగ : శర్మా ! నా కొడుకుకాక మఱియొక్క డెవ్వడైనను నాపయికి దండెత్తి రాగలడా ? .... అయిపోయిన దయ్యా ! సర్వము తారుమారయినది.

అంబ : నిరుత్సాహపడకండి ప్రభూ !

నాగ : నాయాశలు అడుగంటి పోయినవి. మధుర సింహాసనము మీద నా కొడుకు అధిష్ఠించి రాజ్యపాలన చేయుచుండగా చూచు భాగ్యమునకు నేను నోచుకొనలేదయ్యా.

సుంద : ఒకవేళ తొందరపడి మాట యిచ్చినా, తిరిగి తమను చూచేసరికి మారిపోకూడదా ?

నాగ : మారిపోవుటయా ! మన యదృష్టమే మారిపోయినది.

అంబ : తమరింత వాత్సల్యతాపూర్ణులని తెలిసి కూడా కుమారులు యింతపనికి సాహసించటమా ?

నాగ : సాహసించ కేమిచేయును. రాయలవారిచ్చిన బలము, తిమ్మరుసెక్కించిన చలము వాని మతిని విరుగతీసినవి.

సుంద : అంతమాత్ర మాలోచన లేనివారా ప్రభూ మీ కుమారులు.

నాగ : వానికి రాజ్యము చేదయినది. తండ్రి వధ్యుడైనాడు.

అంబ : మహారాజా ! శాంతించండి. సెలవైనచో తమ పక్షమున ప్రతినిధిగా నేను కుమారులవద్దకు రాయబారిగా పోయివత్తును.

నాగ : రాయబారము? ... నాయాజ్ఞలను శిరసావహించ వలసిన నాకొడుకు దగ్గరకు మా రాయబారమా ?.... ఈ రాజ్య సంపాదనము తనకోసమేనని గ్రహించలేని వాని కడుకు రాయబారమా ?.... వీలులేదు.

అంబ : నా మనవి వినండి. తమ గౌరవానికి లోటు రానీ యను. ఆవేశంలో చేసిన నిర్ణయం మార్చుకోరానంత ప్రబలమైనదిగా వుండదు.

నాగ : నాకా విశ్వాసము లేదు.

అంబ : సామదాన భేదములు ప్రభువుల కర్తవ్యములు కదా ?

నాగ : సాటి ప్రభువును గూర్చియే యైనచో నీవు చెప్పునది ధర్మమే. కాని, వీడు నా వాడు. నా కడుపున పుట్టిన వాడు. తనే సర్వస్వముగా భావించు నన్నే కాలదన్నిన మదాంధుడు.

అంబ : కావచ్చు. ఇది రక్త సంబంధమైన విషయం. ఆజ్ఞ యిప్పించండి.

నాగ : (లేచి తిరుగుచూ) నేనో...వాడో....ఎవరో ఒక రము మాత్రమే బ్రతుకవలయును. మా యిరువురి జీవి తములకు స్థానము లేదు.

అంబ : మహాప్రభూ ! ఆగ్రహము రాతగిన సమయమా యిది.

నాగ : ఇంతకంటె నాకు రాతగిన అపకారము వేరొక టున్నదా ? ఎంత జరుపవలయునో అంతయు జరిపిన తరువాత యింకను యీ ముష్టియేమి ?

సుంద : తమ నిర్ణయం తరువాత చేసుకోండి. కాదనువారు లేరు. శర్మగారికి అనుజ్ఞ దయచేయించండి.

నాగ : అనుజ్ఞ ?... దేనికోసమయ్యా మా యనుజ్ఞ.

అంబ : పుత్రక్షేమం కోసం...కుటుంబ సంరక్షణకోసం.

నాగ . ఇంత కిరాతకమున కొడిగట్టిన వాడు మీ రాయబారమును మన్నించునా ?

అంబ : నష్టమేమి ? దేనికైనా మనము సిద్ధమేకదా !

నాగ : నా కిష్టము లేదు. మీ యిష్టము.

అంబ : అనుగృహీతులము. దయచేయండి. (వెళ్తారు)

( తెర )

# ఐదవ రంగం

ప్రదేశము: విజయనగర సైనిక శిబిరం.

(ప్రవేశం విశ్వనాథ నాయకుడు, అంబయశర్మలు)

విశ్వ : మీరు వార్తాహారులా ? రాయబారులా

అంబ : ఆ రెండింటితోపాటు మిత్రుడనుకూడా ప్రభూ !

విశ్వ : మాకు ప్రభు బిరుదములతో పనిలేదు. మేము సార్వభౌముల ప్రతినిధులము మాత్రమే. సరే ! మీ తెచ్చిన వార్తయేమి ? మీరు రెండు విషయములను గుర్తించుకొని మాటాడవలసి యున్నది. ఒకరు రాజప్రతినిధి.... మఱియొకరు రాజద్రోహి. ఒకరు కుమారుడు....మఱి యొకరు తండ్రి.

అంబ : చిత్తం. తమ సెలవుకు వ్యతిరేకిస్తానా ? తండ్రిగారి యాజ్ఞలను తమకు నివేదించుటయేకదా మా కర్తవ్యం.

విశ్వ : సరియే చెప్పవచ్చును.

అంబ : జీవితం అంతటిపైనా రాజకీయాలే అధ్వర్యంచేస్తున్నట్లయితే మానవత్వం కుంటుపడుతుంది అని మనవి.

విశ్వ : అది కుంటువడడమేకాదు, మొదలంట నశించినది కనుకనే మీ యీ శ్రమ, మా యీ బాధ.

అంబ : తమరావిధంగా ఎందుకూహిస్తున్నారు ? వంశోద్ధారకులు, పరమోదారులు, వీరాగ్రేసరులు, పితృగర్వ

కారకులు అయిన తమకోసం, తమ సుస్థిర భవితవ్యం కోసం.

విశ్వ : అనవసర కాలహరణమేమి? విషయమేదియో సూటిగ చెప్పరాదా ?

అంబ: (వెనుకకుజంకి) చెప్పుచున్నాను. అవధరించండి. ఈవిషయంలో తండ్రిగారికి ప్రత్యేక ప్రయోజనమేమీ లేదు. కేవలం ఏకైక పుత్రులైన తమ కోసం ....

విశ్వ : వంశగౌరవ నిర్మూలనముచేసి, కుటుంబానికిచిచ్చుపెట్టి, సమస్తమూ బూడిదచేసి ఎవరిని ఉద్ధరింతమని మీ యూహ?

అంబ : క్షమించండి. నా మనవిని ఆలకించండి.

విశ్వ : విననవసరము లేదు. మీరు తేల్చి చెప్పండి. గౌరవ రక్షణమా? భక్షణమా?

అంబ : ఆ విషయం తమచేతిలో వుంది.

విశ్వ : మాచేతిలో నున్నదా? ఇంత కఠోర కార్యమునకు పాల్పడి, ఉచ్చనీచములరోసి, కేవల స్వార్థబుద్ధితో ద్రోహము తలపెట్టిన మీచేతిలో ఏమియులేదా? ద్రోహమంతయు మాదేనా?

అంబ : జరిగినదాని మంచి చెడులను గూర్చి తరువాత తమరు సావకాశంగా చర్చించండి. అది...

విశ్వ : (ఆపి) ఏమంటున్నారు? మహానర్థములకు మూలమైన హేయకార్యమును .. స్మరించు మనుచున్నారా ?...వీలు లేదు. ఈ మాటలతో మమ్ముల మోసగించలేరు. మీ ప్రభువు సామ్రాజ్యమునకు లొంగియే తీరవలెను.

అంబ : అట్లా సెలవీయటం తమకు ధర్మమా?

విశ్వ : ధర్మాధర్మ నిర్ణయములను చేయవలసినది మీరు కాదు. అది మా స్వకుటుంబ విషయము. ప్రస్తుతము మనముమాటలాడుచున్నది జగత్కుటుంబమును గూర్చి.

అంబ : తమ చిత్తము. చక్రవర్తులకు అనేక యుద్ధాలలో ఘన విజయాలు చేకూర్చినవారు మీ తండ్రిగారు...అసమాన ప్రతాపంతో సామంత మండలేస్వరులను వణకించి అరి గాపులనుగా చేసిన వీరులు మీ తండ్రిగారు...ప్రభువుల యభిమతములను స్వీకరించకనే స్వతంత్రించి అనేక సాహస కార్యాలచేసి జయమంది పిదప ప్రభు గౌరవ పాత్రులయిన మేధావులు మీ తండ్రిగారు.

విశ్వ : అవును. తండ్రిగారంతటి వారే యగుదురు. అందుకు వారికి నమస్సులు.

అంబ : ఖడ్గమును చేపట్టినది మొదలు, విడచిపెట్టునంత వరకూ ప్రభుసన్నిధిలో సర్వస్వమూధారనోసిన త్యాగ మూర్తి మీ తండ్రిగారు.

విశ్వ : (మౌనం)

అంబ : నిండువయసు మొదలు, పండువయసు వరకూ రక్తములోని ప్రతికణమును చిందించి సార్వభౌములకు వీరకుంకుమగా అలంకరించిన సాహసులు మీతండ్రిగారు.

విశ్వ : (మౌనం.)

అంబ : అనేక మూర్ఖ ప్రాణాలను సయితం నిర్లక్ష్యం చేసి, రక్తంధారగా కారుతున్నా, కండలు వ్రేలాడబడుచున్నా, పోవనున్న ప్రాణాలను సైతం నిర్లక్ష్యంచేసి సామ్రాజ్య. గౌరవ రక్షణకై ప్రయత్నించిన కృతజ్ఞతా మయులు మీ తండ్రిగారు.

విశ్వ : (కళ్లనీళ్లతో) అంబయశర్మగారూ! అట్టి పరమ పవిత్ర మూర్తియగు తండ్రిగారిచే ప్రసాదింపబడినది యీ దేహము.

అంబ : సత్యము చమూపతి! క్షమించండి. అట్టి మీ తండ్రి గారు యీమాత్రపు స్వాతంత్ర్యమునకైనా అర్హులు కారా? చక్రవర్తులుమాత్రము సేవకులకు ఋణపడిలేరా? వారుమాత్రము ఋణమును తీర్చుకోకూడదా ?

విశ్వ : ఏమంటున్నారు ?

అంబ : ధర్మాన్నే మనవిచేస్తున్నాను. ఒక్క నాగమ నాయకులవారే కాదు, వారి కుమారులయిన తమరు

కూడా జీవితాలను ప్రభువులకు అంకితముచేసిన వారే కదా ? మీవంశము యింత మాత్రపు స్వాతంత్ర్యమునకు నోచుకోనలేదా ?

విశ్వ : హద్దులు మీరిన స్వాతంత్ర్యము, నియమము మీరిన జీవితము శ్రేయస్కరములా ?

అంబ : తండ్రిగారి హృదయం తమకు తెలియదా ? ఇంత పండిపోయిన వయస్సులో వారికి ఈ రాజ్య సుఖాల మీద కాంక్ష యెందుకు ?... ఈ భోగాలెందుకు ?... ఆలోచించండి సైన్యాధీశ్వరా ! కేవలం యిది పుత్ర ప్రేమ... పుత్రక్షేమం.

విశ్వ : పుత్రక్షేమమా ? నమ్మినవారిని ద్రోహ మొనర్చుటయే పుత్రక్షేమమా ?...వంశగౌరవ సమూల విచ్ఛేదనమే పుత్రక్షేమమా ?...చిరకాల సముపార్జిత యశో వైభవ శ్రీ సంక్షాళనమే పుత్రక్షేమమా?...తండ్రిగారి యంతటివారు చేయదగిన కార్యమా యిది ?

అంబ : శాంతించండి చమూపతి !

విశ్వ : ఎవరిని ధర్మ స్వరూపులని, వీరావతారమని, ప్రభు కృపాపాత్రులని, దేశక్షేమ సంధాతయని, లోకము వేనోళ్ళ పొగడినదో ? ఆయనయే నీచకార్యమునకు పాల్పడ వచ్చునా ?... ఇదియేనా పుత్రక్షేమ విధానము?

మీరాయబారమిదియే యైనచో మీరు చెప్పదగినది లేదు, మేము వినతగినదియు లేదు.

అంబ : కఠినంగా శాసి స్తే మనవిచేయగలనా ? తొందరించి ఒక నిర్ణయానికి వచ్చే యీ క్షణం, ముందు ముందు ఎంతటి ప్రమాదాలకు దారి తీస్తుందో తమ రూహించండి. తమరు స్వతంత్రులు. సర్వాధికార సమన్వితులు. ఏమిచేసినా మిమ్ములను కాదనగలవారులేరు. శాంతంగా ఆలోచించండి.

విశ్వ : ఆలోచించ నవసరంలేదు. అన్ని విషయములు పూర్తిగా గ్రహించియే మాట్లాడుచున్నాము.

అంబ : ఉద్వేగంలో సత్యం మఱుగు పడుతుందే మోదళపతీ!

విశ్వ : మితిమీరి మాట్లాడినచో తండ్రిగారి రాయబారి పైననూ శిక్షింపవలసి వచ్చును.

అంబ : మన్నించండి. నిరాశయే ప్రతిఫలమా ?

విశ్వ : దండనము లేనందుకు సంతోషించి ...

అంబ : తమ యీనిష్ఠురోక్తులకు తండ్రిగారెంత బాధపడతారో ఊహించండి. జయాపజయాలుమనచేతిలోవికావుగదా? ఒకరి పరాభవము మరియొకరికి కాదా ?

విశ్వ : ఇప్పుడు బాంధవ్య ప్రశంశయే లేదు. ఎంతవఱకు మీ ప్రభువులు విజితులుకారో, అంత వఱకూ మేము రాజ ప్రతినిధులము మాత్రమే.

అంబ : ఆ సార్వభౌములు మాత్రము ప్రతినిధులుకారా ?

విశ్వ : అవును. ఆయన ప్రజలకు, దేశమునకు, మతమునకు, కర్ణాటకాంధ్ర సామ్రాజ్య సర్వస్వమునకు ప్రతినిధి.

అంబ : తమరు సెలవిచ్చుచున్నది మానవాతీతమైనధర్మమే. కాదనటంలేదు. కాని మనం మానవులమని మఱియొక మారు మనవి చేసుకుంటున్నాను.

విశ్వ : ఈ నీతిని మీ ప్రభువుగారితో మనవి చేయకపోయి నావా ? కుటుంబ ధర్మమున కంటె రాజధర్మము ఉత్కృష్టతరమైనది కదా ?

అంబ : (మౌనం)

విశ్వ : వెళ్ళు, నాయనగారితో మనవిచేయుము. "మీ గౌరవ మును, మీ వంశ 'గౌరవమును పునరుద్ధరించుటయే కుమారుని విధ్యుక్త ధర్మము" అని.

అంబ : సెలవు తీసుకొందునా ?

విశ్వ : సరే !...ఎవరక్కడ ?

(ప్రవేశం సేవకుడు)

సేవ : చిత్తము.

విశ్వ : ఈ అంబయశర్మగారిని సగౌరవముగా మన స్కంధా వారమును దాటించుము.

సేవ : చిత్తము.

అంబ : (నమస్కారం చేసి వెళ్తాడు.)

విశ్వ : (చీకాకుతో) ఛీ ! ఛీ !...దౌర్భాగ్య సమస్య... వ్యర్థవాదము.

(మంచంమీద పడుకుంటాడు. కొంతసేపటికి కల. కలలో మనో భ్రమం. తలవైపు నరసానాయకుడు, పాదములవైపు అంబయశర్మలు వచ్చి నిలుచున్నట్లు ఊహిస్తాడు. రెండుమూడు సారులు అటు యిటు మెసులుతాడు. కొంతసేపటికి కనులు నులుపుకుంటూ చివాలున లేస్తాడు.)

అంబ : చమూపతీ! మా ప్రార్థన త్రోసివేసినట్లేగదా ? కని పెంచి యింతవాణ్ణిగాచేసిన కన్నతండ్రికి చూపించే కృత జ్ఞత యిదేనా ?

విశ్వ : పితృకృతఘ్నుడను...అవును...కాలేను.

నర : నిన్ను నమ్మి యింత సైన్యాన్ని చేతికిచ్చి పంపిన ప్రభువులకు కృతఘ్నుడ వౌతావా ?

విశ్వ : ఆఁ...కాలేను.

అంబ : ప్రభువనగా ఎవరు ? మొగమిచ్చకాలు పలికి, బులి పించి తన కార్య సాధనంకోసం, లేనిగౌరవాన్ని ఆపా దించి, పనులు చేయించుకొనే స్వార్థపరుడు.

విశ్వ : ప్రభువు స్వార్థపరుడా ?...

నర : స్వార్థపిశాచీగ్రస్తుడైన మానవుడు తన అకృత్యమును సమర్థించుకొనుటకై తర్కము నాశ్రయించుకొనును. అది కేవలము ఆత్మవంచనము.

విశ్వ : అవునవును. నేను ఆత్మవంచకుడనే.

అంబ : "ఆత్మావై పుత్రనామాసి" అన్నారు. కనుక తండ్రి వంచనము ఆత్మవంచననే అవుతుంది.

విశ్వ : నాతండ్రి !...

నర : ప్రభువు రాజ్యమున కంతకును తండ్రివంటివాడు. కావున ప్రభుద్రోహము ఆత్మవంచన కంటె అధ మాధమము.

విశ్వ : అధమాధమనే...సత్యము.

నర : సంఘము సనాతనము. వ్యక్తి నశ్వరము. ఈ నశ్వరమైన దానికొఱకు సనాతనమును బలిచేయుదువా ?

విశ్వ : చేయను...అంతఘోరం చెయ్యను.

అంబ : అల్పసంతోషివై మెప్పుల కుబ్బి మొనగాడివై తండ్రితో యుద్ధానికి బయలుదేరావు.

విశ్వ : అబ్బా ! తండ్రీ ! క్షమించు.

నర : మొనగాడవై రాజద్రోహిని పట్టి తెత్తునని రాజఖడ్గమును తీసుకొని బయలుదేరావు.

విశ్వ : ఖడ్గ గ్రాహిని. అపరాధిని ప్రభూ !

అంబ : అందని ఆశయాలతో జీవితాన్ని నాశనం చేసుకుంటావా ? దేనికోసం నీ జీవిక ? దేనికోసం నీత్యాగం? దేనికోసం నీ యీబాధ ?

విశ్వ : వ్యర్థము. అంతా వ్యర్థము ?

నర : చేసిన ప్రతిజ్ఞను మఱచి, దక్కబోని రాజ్యసౌభాగ్యాలకు ఆశపడి జీవితాన్ని నాశనము చేసుకొంటువా? దేనికోసం నీ పీరత్వం ? దేనికోసం నీ ప్రవర్తన ? దేనికోసం నీ లక్ష్యం ?

విశ్వ : అవును. లక్ష్యాన్ని నిర్లక్ష్యం చెయ్యను.

అంబ : పెంచినవానినే త్రుంచుతావా ?

విశ్వ : అన్యాయం. మహాపాతకం.

నర : త్రాగినరొమ్మునే తన్నుదువా ?

విశ్వ : అన్యాయం...అన్యాయం...

అంబ : తండ్రి నీకోసం చేశాడు.

విశ్వ : ముమ్మాటికిని సత్యం. నాకోసమే...

నర : ప్రభువు దేశము కొఱకు చేయుచున్నాడు.

విశ్వ : ఉజ్వలమైన సత్యమది.

అంబ : పితృ హంతా!

విశ్వ : ఆఁ !

నర : రాజ ద్రోహీ !

విశ్వ : ఆఁ ! ఆఁ ! (కెవ్వున కేక వేస్తాడు. కల మాయమవుతుంది. దిగ్గునలేచి నిలుచొని) ఎవడురా అక్కడ?

( ప్రవేశం సేవకుడు )

సేవ : ఆజ్ఞ.

విశ్వ : ప్రోగించమను రణభేరి.

సేవ : చిత్తము.

(తెర)

# ఆరవ రంగం

ప్రదేశము : మధుర రాజభవనము.

(నాగమ నాయడు ఒంటరిగా తీవ్రాలోచనతో ప్రవేశం.)

నాగ : ఎవ రచట ?

(ప్రవేశం సేవకుడు)

సేవ : చిత్తము.

నాగ : అంబయగారింకను రాలేదా ?

సేవ : రాలేదు ప్రభూ !

నాగ : రాలేదు...సరే. సుందరేశ్వరుని రమ్మను.

సేవ : చిత్తము. (వెళ్తాడు.)

(ప్రవేశము సుందరేశ్వరుడు)

సుంద : (ప్రవేశిస్తు) మహారాజుల కభివాదనము.

నాగ : (పరధ్యానమున) ఎవరువారు ? (చూచి) ఓహో ! సుందరేశ్వరులా !

సుంద : మహా ప్రభువులు తీవ్రాలోచనలో నున్నట్లున్నారు.

నాగ : ఇంకను అంబయగారు రాలేదుకదా ?

సుంద : ఒకవేళ కుమారుడుగారు "మేముకూడా వస్తాము. ఉండమ"న్నారేమో !

నాగ : అసంబద్ధము. ఇక వాడితో ప్రమేయము లేదు. వాడి తల బిరుసుతనము సత్యమును అవగతముచేసికొననీయదు.

సుంద : కన్నతండ్రిగారికంటె మిన్నయా ప్రభువు? రాజ్యమునకంటె దాస్యమే అభిలషితమైనదా? ఇంత విరుద్ధముంటుందా మహారాజా !

నాగ : తడిసినగాని గుడిసెను కప్పడు. ఈనాగమనాయుని పౌరుష ప్రతాపాలు యింతవఱకు శత్రువులమీద తప్ప మిత్రులమీద దుర్వినియోగము కాలేదు. ఈనాటికాదశ వచ్చినది.

సుంద : ఇంతవఱకూ పర్యవసానమే తేలలేదు. తమరు అనవసరంగా ఆందోళన పడుచున్నారు.

నాగ : ఆందోళనముకాదు సుందరేశ్వరా ! నిర్ణయమునకే వచ్చినాము. పోరుతప్పదు.

(అంబయశర్మ కాళ్ళీడ్చుకొనుచూ ప్రవేశము.)

సుంద : (చూచి) అరుగో మాటలలోనే వచ్చుచున్నారు అంబయగారు.

నాగ : ఆ! (చూచి) ఏమయినది అంబయగారూ ?

అంబ : మహారాజులకు అభివాదనములు. (తలవంచుకొంటాడు.)

నాగ : అర్థమైనది అంబయగారూ ! తిరస్కరించినాడు. అంతేనా?

అంబ : వేయి విధాల చెప్పాను. నయానా చెప్పాను; మీ ప్రేమను గురించి చెప్పాను...

నాగ : (అందుకొని) వాడి చెవునకెక్క లేదు.

అంబ : బండరాయియైనా కరుగుతుందికాని...

నాగ : (అందుకొని) తెలియునయ్యా తెలియును. వాడి మనసు కరుగదు. కరుగబోదు. అనుభవించును. వాత్స ల్యముతో పంపిన సందేశమును నిర్లక్ష్యము చేసిన పాప ఫలమును అనుభవించును.

సుంద: ఇంతదూరాలోచనలేనివారు, యింత మహాసైన్యమున కధినాథులా ?

నాగ : దురాలోచనమే నిండియున్న మనస్సునకు, దూరా లోచనమా ? వ్యర్థరాయబారము. నాయంతటివాడు అర్థించుటయు, ఇంకొక వ్యర్థుడు తిరస్కరించుటయునా ? అవమానము.

అంబ : చాలా పట్టుదలగా మాట్లాడినారు.

నాగ : పట్టుదలయా ? ఏమిటా పట్టుదల ? ఎవరిమీద ? ఈ రాజ్యము నా కోసమా ? ఈ బాధలు నాకొఱకా ? ఎవరిమీద ఆ పట్టుదల ? యుక్తాయుక్త వివేకశూన్యుడగు వానికి...కృతఘ్నునకు చెప్పునదేమి ? వినునదేమి ?... కానిమ్ము.

అంబ : ఆయన రాజభక్తి అనే మైకములో పొరలాడు చున్నారు.

నాగ : రాజభక్తి. తాను రాజు కాడా? సేవకులకు ప్రభు గౌరవములు తెలియునా? ఈ వృద్ధుడు పుత్రక్షేమాభిలాషియని, పుత్రగతప్రాణుడని తెలియని మూర్ఖుడు. కానిమ్ము. విధి యెట్లున్నదో అట్లు జరుగును.

సుంద : మనమే అంత చేతులు చచ్చియున్నామనుకున్నారా?

అంబ : అసలు సంధి విషయమును మనవి చేయనేరాదని శాసించినారు.

నాగ : శాసించునయ్యా శాసించును. ఇంత మహాసైన్యమునకు అధినాథుడుగదా? రాజభక్తుడు...పితృద్రోహి.

(తెరలో రణభేరి ధ్వని వినిపిస్తుంది.)

నాగ : రణభేరి! పొమ్ము అంబయశర్మా! రణభేరి మ్రోగించుము.

అంబ : చిత్తము. (వెళ్లబోగా)

నాగ : అంబయా! మూర్ఖుడు, పితృద్రోహి, వంశఘాతకుడు అయిన విశ్వనాథుని ప్రాణములతో మాకు చూపించవలదు. వాని మృతకళేబరమును మాకు కానుక నిచ్చిన యోధుడు మా యనంతరము యీ మధురాధినాథుడు కాగలడని మా యాజ్ఞగా సైన్యమున చాటింపించుడు.

5

అంబ : ఇంతటి కఠోర నిర్ణయమా మహారాజా !

నాగ : ఎవరు కఠోరులు. మేమా ! (తీవ్రముగ) వెళ్లుము.

అంబ : చిత్తము. ( వెళ్తాడు. )

నాగ : సుందరేశ్వరా ! మాయశ్వము నాయత్తము చేయింపుడు.

సుంద : ఆజ్ఞ. ( వెళ్తాడు. )

నాగ : వ్యర్థ ప్రయత్నము ... అంధకారబంధురమైనది భవిష్యత్తు. (ఇటుఅటు తిరుగుచుండగా ఫిరంగుల మ్రోతలు వినవస్తాయి ) అహో ! శత్రు శతఘ్నికాధ్వనులు. మా నాయకరాజ వంశ నిర్మూలమునకు వచ్చినదీయుద్ధము. నా హృదయమే మృత్యుదేవతకు నాట్యస్థానమై పోయినది. నా జీవితమంతయు శూన్యమై, వ్యర్థమైపోయినది. ఎక్కడి పుత్రుడు? ఎక్కడి ప్రేమ? ఛీ! ఛీ! ఈ నాగమ నాయనికంటె వ్యర్థుడు లేడు ... నిష్ఠురమైన రాజ్యతంత్రము. ( సైనిక కోలాహలం వినిపిస్తుంది. ) అప్పుడే మారణహోమము జరుగుచున్నది. (కత్తిదూసి) ఖడ్గమా! శత్రురాజ హృదయభేదన పటిష్ఠమవగు నీవు, పుత్రమర్మ విచ్ఛేదనమునకు సిద్ధపడుము.

( తెరలోనుండి "మహారాజా" ! అని కేకలు వినిపిస్తాయి. )

వచ్చుచున్నాను. ( రివ్వున వెళ్ళిపోతాడు. )

(తెర)

# ఏడవరంగం

ప్రదేశము : యుద్ధభూమి.

(దీర్ఘాలోచనా నిమగ్నుడై విశ్వనాథుడు ప్రవేశిస్తాడు. ఒరలో కత్తి వ్రేలాడుతుంటుంది. తలనెత్తి యుద్ధస్థలంపైపు దృష్టిని సారిస్తాడు. వెనుకనుంచి నరసానాయడు ప్రవేశిస్తాడు.)

నర : దళవాయీ !

విశ్వ : (నిశ్వసించి వెనుదిరిగి చూచి) ఎవరు వారు ? నరసయ్యగారా !

నర : చిత్తము. యుద్ధము ముమ్మరముగ జరుగుచున్నది.

విశ్వ : విశేషములేమి ?

నర : ఎంత తక్కువ సైన్యమయినప్పటికిని ఎంత నిపుణముగ పోరు సలుపుచున్నదో చూచినారా ?

విశ్వ : మధురసైన్యముల కంత చేవ యెప్పటినుండివచ్చినది?

నర : సంశయించు పనియేమి ? నాగమనాయకులవారి పర్యవేక్షణము కదా ?

విశ్వ : తండ్రి యెట్లున్నారు ?

నర : ప్రళయ రుద్రులవలెనున్నారు. ఇంతకుపూర్వము చాలా యుద్ధములలో వారిని నేనెఱుగుదును. కాని యింతటి ప్రచండమూర్తిని యేనాడును చూచియుండ లేదు.

విశ్వ : ఖడ్గజీవికదా ?—(ఆలోచన)

నర : ఏమిటి ఆలోచన ?

విశ్వ : నేను వచ్చియు, సార్వభౌముల కీర్తికి మెఱుగులు తేలేకపోయినాను.

నర : యుద్ధ పర్యవసానమును, మీరు అట్లు ఊహించుచున్నారా ?

విశ్వ : నరసయ్యగారూ ! విజయనగర సైనికులకు విజయ సందేహమా ? కేవలము ఆజ్ఞామాత్రమున నెరవేరతగిన యీ స్వల్పకార్యము, యుద్ధానంతరమునగాని సాధించలేక పోవుచుంటిమిగదా ?

నర : చమూపతీ ! ఆజ్ఞలకే బెదరువారయినచో, యింతపనికెట్లు సాహసింతురు ?

విశ్వ : ద్రోహమును సాహసమనవచ్చునా ?

నర : కేవలము పుత్రగత జీవులయిన నాగమనాయకులవారు, మిమ్ములను చూచిన తరువాత యింత యుద్ధానికి పూనుకొందురని నేనూహించలేదు.

విశ్వ : ఆ పుత్రవాత్సల్యమే మాత్సర్యముగా మాఱి పోయినది.

నర : సత్యమేకావచ్చు. లేనిచో, యీవయసులో అంత విజృంభణము సాధ్యమా ?

విశ్వ : దుర్ధర్షక ప్రతాపము, కానిమ్ము నరసయ్యగారూ! మీరు అంబయ సుందరేశ్వరులను కనిపెట్టి యుండుడు. కరుణకు స్థానములేని కఠోర సమరాంగణమిది. సార్వభౌముల పవిత్ర యశస్సు మనపై నాధారపడియున్నది.

నర : నాగమనాయకులవారే ప్రత్యర్థులు కానిచో, యీ మధురసైన్య మింతకాలము నిలిచెడిదా ?

విశ్వ : ఇపుడు మాత్ర మింకెంతకాలము నిలువగలదు. శతఘ్నుల నుపయోగించుడు. శత్రుని శ్వేష మగువఱకు విశ్రమింపకుడు.

( తెరలోనుండి "దళపతులెచట? నాగమనాయకులవారి యెదుట మనసైన్యము నిలచునట్లు లేదు" అని వినిపిస్తుంది. )

విశ్వ : వచ్చుచున్నాను. నరసయ్యగారూ! జాగ్రత్త. ( వెళ్తాడు. )

నర : మా దళవాయి కిదియొక విషమసమస్య. చరిత్రలో కని విని యెఱుగని ఘట్టమిది.

( ఎదురుగా సుందరేశ్వరుడు కత్తితో ప్రవేశం. )

నర : (చూచి) ఓహో! సుందరేశ్వరులా? . . . వాచాలా! తగుదునని కత్తిని దాల్చితివా? రమ్ము. ఏదీ నీప్రతాపము?

సుంద : నరసయ్యగారూ! తండ్రికొడుకుల నడుమ తగాదాను సృష్టించడం కాదుసుమా!

నర : ఓయీ ! నాయకవంశ ధూమకేతూ ! కయ్యమునకు దారితీసినది మీరా, మేమా?

సుంద : ఎవరయినది క్షణములో తేలగలదు.

నర : అంతటి పిరుడవా ! ఏదీ నీకత్తిపదును ...

( ఇద్దరూ తలపడతారు. ద్వంద్వయుద్ధంలో సుందరేశ్వరుడు గాయపడి తూలిపడి పారిపోతాడు. )

నర : ఒక పీడ వదలిపోయినది. మఱియొకటి యున్నది.

( తెరలో నాగమనాయని కంఠం. )

నాగ : విజయనగరసైన్యము నిశ్శేషముకావలయును. మధుర సైనికులారా ! ...

నర : ఓహో ! భీష్మాచార్యులను మించిపోయినాడీ వృద్ధ వీరుడు. ( సరభసంగా వెళ్ళిపోతాడు. )

( వెనుకనుండి వీరావేశంతో నాగమనాయకుడు ప్రవేశం. )

నాగ : ఏడిరా? మీ చమూపతి. పితృద్రోహి యెచట ?

( ప్రవేశము వెనుకనుంచి ఆత్రముగా అంబయ్య. )

అంబ : ప్రభూ !

నాగ : (నిలచి గంభీరముగా) ఏమా తొందర?

అంబ : మన సైన్యమంతయు భీభత్సమై పోవుచున్నది. ఇప్పటికి మూడువంతుల సైన్యం బలియై పోయింది మహారాజా !

నాగ : మనము బ్రతికిలేమా

అంబ : ఉన్నాము. ఫలమేమి ?

నాగ : ఫలమా? వీరవిహారము. శత్రుసంహారము. స్వర్గ సంచారము.

అంబ : సుందరేశ్వరుడు బలియైనాడు.

నాగ : ఆతని ప్రాధాన్యతయేమి ?

అంబ : క్షమించండి మహారాజా ! చచ్చి సాధించునదేమి?

నాగ : ఛీ! ఛీ! పొమ్మావలకు. బ్రతికి యుట్టిగట్టుకొని యూగెదవా? మానహీనపు బ్రతుకు నభిలషింతువా? పొమ్ము. చేతనైనచో విక్రమింపుము, కాకున్నచో విశ్రమింపుము.

అంబ : శాంతించండి ప్రభూ !

నాగ : శాంతి ?...నిరాశాహతజీవికి శాంతి?... పరాభవిత మృగేంద్రమునకు శాంతి ?...పుత్ర తిరస్కృతప్రాణికి శాంతి ? ... పొమ్ము ! అంబయా ! తూర్పుదిశకు పరువెత్తుము. (తాను ముందుకు నడచుచూ) ఎచటరా? పితృద్రోహి యెచట ?

(ఎదురుగా సరసానాయకుడు వస్తాడు.)

సర : (ఎదురుగా నాగమనాయునిచూచి) ఓహో! నాగమనాయకులవారా ?

నాగ : (ఆగి) ఎవరు ?...నరసానాయకులవారా ?

నర : శాంతించండి నాయకా.

నాగ : లేదు. నేను శాంతించనవసరములేదు. పోటు మానిసి వైనచో కత్తిదూయుము.

నర : ఎవరిమీద దూయమందురు ?

నాగ : ప్రత్యర్థిమీద.

నర : నాగమనాయకులవారు ప్రత్యర్థియా ?

నాగ : నరసయా ? పిరికిమాటలు మాని నిలువుము. అసలు నీతో నాకేంపని. మీ మహానాయకుడు, వీరాధివీరుడు, గర్వాంధుడు, పితృద్రోహి, పడివాడు ? తండ్రిని చెఱ బట్టుటయనిన తేలికయనుకున్నవాడు, వాడేడి ?

నర : అట్లనుకొనలేదు. మీ శౌర్యము నెఱుగనివారెవరు ? మీకు విరోధులైనవారెవరు ? మన మందరము ఒక కుటుంబములోనివారము కామా ?

నాగ : విన...కుమారునిచేతిలో చావలేదందువు ?...మీకు దాసోహమనలేదందువు ?...నా స్వాతంత్ర్యమును చంపుకొన లేదందువు ? ... ఎందుకయ్యా యీ పనికిరాని కబురులు.

(తెరలో "సార్వభౌములకు జే" అను కేకలువిన్నంటుతాయి.)

నర : విన్నారా చమూపతీ ! యుద్ధపర్యవసానము.

నాగ : తెలియును. నా యెదుట నిలువకు. నాకత్తి నీయట్టి వాని రక్తమును రుచి చూడజాలదు. వాడు ... ఆద్రోహి...పితృద్రోహి...

నర : నాయకులవారూ! దాదాపు యుద్ధము పూర్తియైనట్లే. ఇంకను సార్వభౌముల గెలుతుమనుకొనుచున్నారా ?

నాగ : నాకు ఆయనతో పనిలేదు.

నర : మీకు కుమారుడే కావలయును. వేయిదేవుళ్ళకు మొక్కి, ఆ ఫలితంగా శివ వరప్రసాదముచే కన్న కొడుకును, పితృ గర్వకారకుడైన కొడుకును, ప్రాణాప్రదుడైన కొడుకును, విశేషించి ఏకైక పుత్రుని చంపి సాధించునదేమి ? అనుభవించునదేమి ? ... ఆలోచించితిరా ?

నాగ : నీ నీతులు నా చెవి కెక్కుటలేదు. దాహము – రక్త దాహము——

నర : యుద్ధము సమాప్తమైనది.

నాగ : లేదు. ఈ నాగమ బ్రతికియే యున్నాడు. మరల చెప్పుచున్నాను నాకత్తికి బలికావద్దు.

(ఎదురుగా విశ్వనాథుడు ప్రవేశించును.)

విశ్వ : ఆగండి నరసయ్యగారూ! ... తండ్రీ! అవిధేయ పుత్రుడు నమస్కరించుచున్నాడు.

నాగ : ఎవడవురా ?...నీవా ? ... పితృఘాతకుడవా ?...
వంశోద్ధారకుడవా ?...ఏదీ నీ ప్రతాపము ?

విశ్వ : నరసయ్యగారూ ! యుద్ధము పూర్తియైనది. సార్వభౌములయెడ నాకుగల బాధ్యత నెరవేర్చుకున్నాను. తండ్రీ ! పితృఋణ విముక్తుడు కాగోరుచున్న యీ విశ్వనాథుని శిక్షింపుడు. ఇదిగో శిరము...శాంతించండి. (వంగి నమస్కారం చేస్తాడు.)

నాగ : (నిర్విణ్ణుడౌతాడు.)

నర : నాగమనాయకులవారూ ! రాజశాసనమున్నపై పితృసమానులైన మీా కపకారము చేయబూనిన నన్ను...

నాగ : (ఆపి) ఆఁ...ఆఁ...ఇదేనా మీా శక్తి ? ఇదేనా మీా ధీరత ?

విశ్వ : తండ్రీ ! క్షమింపుము.

(నాగమనాయకుడు కదలక నిలుచుంటాడు. ఇరువురూ నమస్కారం చేస్తుండగా........)

( తెర )

# ఎనిమిదవ రంగం

ప్రదేశము : విజయనగర రాజ సభాంగణము.

(ప్రవేశము రాయలు, తిమ్మర్సు, నరసానాయకులు.)

కృష్ణ : నరసానాయకా ! యుద్ధవార్తలేమి?

నర : యుద్ధమారంభమైన జామునకే మధుర సైన్యము చెల్లాచెదరైనది.

తిమ్మ : మఱి నాగమయో ?

నర : సాధారణముగా లొంగలేదు కాని ...

కృష్ణ : రాజ్యము వచ్చుననియైనా యాలోచింపక, విశ్వాసమే ప్రధానముగా నుంచుకొనిన విశ్వనాథుడు నిజముగా ఉత్తముడే యగును.

తిమ్మ : ఆ వంశమే అటువంటిది మహారాజా ! సమయాసమయముల ప్రభావమువలన తాత్కాలికావేశ వశులై వర్తించుట దోషమేయైనను, అది వారిని పూర్తిగా నంటదు.

కృష్ణ : వాస్తవము. ఇందులకు మన నాగమనాయకుడే సాక్ష్యము.

(ప్రవేశము నాగమనాయకునితో విశ్వనాథుడు.)

విశ్వ : సార్వభౌములకు ప్రణామములు.

కృష్ణ : ఓహో ! విశ్వాసప్రధానుడా ! కృతకృత్యుడవై వచ్చితివా ? సంతోషము. రమ్ము.

తిమ్మ : విశ్వనాథా ! ప్రభుఋణ ముక్తుడవు. (నాగమనాయని చెంతకుపోయి) ఇంతపని చేసితివేమయ్యా !

నాగ : ( కృంగిపోతాడు. )

కృష్ణ : మాపై యభిమానమేల తప్పినది నాయడా ?

నాగ : కుంతవ్యుడను ప్రభూ !

తిమ్మ : విన్నాము. నీవు పుత్రగత ప్రాణుడవని. నిస్వార్ధుడవని......

నాగ : అపరాధిని మహామంత్రీ !

కృష్ణ : దళవాయీ ! ఈ విశ్వనాథు డొక్కడేనా నీ పుత్రుడు ? ఈ మహాంధ్రములోని వీరసంతతి నీ సంతానము వంటిదికాదా ? నీలో పొంగెత్తి వెల్లువయి ప్రవహించెడి పౌరుషవాహినిలో నీదియేకాదా యిందరు వీరులు పవిత్రులయినారు.

నాగ : మహారాజా ! ఏమనుచున్నారు ? నేను రాజద్రోహిని.

కృష్ణ : అవును నాయడా ! ఆ విషయమును గ్రహించక పూర్వము నీవు ద్రోహివేకావచ్చు. కాని చూడు. మీ యంతటివారి సహాయసంపత్తులు లేనిచో మా సామ్రాజ్య సంస్థాపనము, తత్పరిపాలనము ఎచ్చటయ్యా.

నాగ : ఉదారమూ ర్తీ! ......

కృష్ణ : సేనాపతీ! ఈ సమ స్తము మీ సంపాద్యముకాదా? ఈ రాజ్యమునకు ప్రభువెవ్వరు? విరూపాక్షస్వామి. మన మందరమును ఆయన ప్రతినిధులము కామా? తర తమభేదములుమాత్రమే మనకున్నవి.

నాగ : స్వామీ! నేను దేవలోకములో నున్నానా? ఈ కృతఘ్నతా మహాపాపికి స్వర్గములో స్థానమురాకూడదు. ప్రభూ! దండింపుడు. ప్రభుదండనముననైనను నాపాపము శమించునేమో? నా తలకొట్టించి కోట ద్వారముపై వ్రేలాడదీయింపుడు. నా రక్తమును చిందింపించి భూత తృప్తి గావింపుడు.

కృష్ణ : నాయడా! విశ్వనాథునివంటి కుమారుని కనిన నీవు పాపివా? ఎంతకాలము మీ ఖ్యాతి భూమిపై యుండునో అంతకాలము నీకు నరకమున్నదా?

నాగ : మహారాజా! (పాదములపై వ్రాల్తాడు.)

కృష్ణ : లెమ్ము మహావీరుడా! అప్పాజీ! ఈ నాగమనాయని శిరము మధుర రాజ్యాభిషేచన పవిత్ర జలముచే అభిషేకింప బడుగాక.

తిమ్మ : ఉత్తమ నిర్ణయము.

విశ్వ : తలవంచి నమస్కారం చేస్తాడు.)

కృష్ణ: దళవాయీ! సామంతుడవై కప్పము కట్టుచు ఎప్పటి వలె సామ్రాజ్యమునకు బాసటవై యుండుము.

నాగ: మహాప్రభూ! తథాస్తు.

(అందరూకలసి "కర్ణాటకాంధ్ర సార్వభౌములకు జయమగు గాక!" అను జయజయ ధ్వానములు చేస్తారు.)

(తెర)



రచయిత

జననం : 1912. కృష్ణా జిల్లా. తిరువూరు తాలూకా, చిట్టేల గ్రామం.

రచనలు : నాటకాలు - 'విజయసింహ' (ముద్రితం). 'కాలవాహిని', 'ప్రేమజ్యోతి', 'కర్ణ', 'సుభద్ర' (అముద్రితాలు).
పద్యకావ్యాలు - 'ఓరుగల్లు' (ముద్రితం). 'శబరి' (ముద్రణలో).

అనువాదం : 'దేవీపంచస్తవము' (కాళిదాసానువాదం - అముద్రితము).

శతకాలు : 'నివాళి', 'శ్రీ నీలాద్రీశ్వర స్తవము' (శ్రీ నల్లాన్‌చక్రవర్తుల వేంకటాచార్యులుగారితో సంయుక్త రచన. రెండూ ముద్రితాలు).

అభిమాన విషయాలు : కవిత్వము, జ్యోతిషము, వాస్తువు.
తప్పనిసరిది - కరణీకము.

ధ్యేయము : శ్రీ రాజరాజేశ్వరి.